PARLE

# మరవద్దు ఆ 'జీ' తత్వం ఎప్పుడూ మనం... జీవితాంతం

## జీవిత పరమార్థం ఇదేలే ఇదే

జీవితంలోని యీ దారుల్లో వేసే ప్రతి అడుగూ పరీక్షే నిజానికి. ఏ దారుల్ని అనుసరిస్తాం, వేటినుంచి విముఖులమౌతాం అనేదే మన వ్యక్తిత్వానికి గుర్తు. ఏదీ కోరకుండా, ఏమీ ఆశించకుండా, ఎవరికైనా తోడ్పడటం. నిజానికి నిజాయితీగా బతకడం అంటే యిదే. మరవద్దు ఆ 'జీ' తత్వం మనం... ఎప్పుడూ మనం, జీవిత పరమార్థం ఇదేలే ఇదే.

ఏళ్ళతరబడిగా భారతదేశంలో అన్నింటికన్న ఎక్కువగా కోరుకుంటూన్న బిస్కట్.




• రుచికరం, నిజంగా శక్తిమయం. •

everest/95/PPL/108 R tl



# చందమామ

ఆగస్టు 1997






విడిప్రతి : **6.00**

సంవత్సర చందా : **72.00**

# చందమామ

## స్వర్ణోత్సవ సంవత్సర

## శుభాకాంక్షలు

ప్రియమైన పాఠక మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ,

నమస్కారం. భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవ వేడుకలు, మన పత్రిక ప్రచురణ స్వర్ణోత్సవ సంవత్సరం కలిసి రావడం ముదావహమైన విషయం. ఇది కేవలం యాదృచ్ఛికం కాదు. భారతదేశంలోని బాలబాలికలు విభిన్న భాషలు మాట్లాడినప్పటికీ భిన్నత్వంలో ఏకత్వం సంతరించుకున్న మనదేశ మహోన్నత సంస్కృతిని తెలియ జేయడం ద్వారా వాళ్ళందరి హృదయాలనూ సమైక్య పరచి, లేత హృదయాలను మంచి భావాలతో నింపి, ఆలోచనాసరళికి మంచిమార్గం చూపాలన్న ఉదాత్త ఆశయంతో శ్రీ బి. నాగిరెడ్డిగారు, కీ.శే. శ్రీ చక్రపాణిగారు కలిసి చందమామ ప్రచురణ మహత్కార్యాన్ని తలపెట్టారు. పత్రికను వివిధ భాషలలో వెలువరించారు!

ప్రస్తుతం ఒకసారి వెనక్కు తిరిగి చూసినప్పుడు, యాభై సంవత్సరాలుగా ఆ ఆశయజ్యోతిని ముందుకు తీసుకువెళుతున్నామన్న తృప్తి కలుగుతున్నది. పెరుగు తూన్న కాగితం ధర, రోజురోజుకూ అధికమవుతూన్న ప్రచురణా వ్యయం; మనిషి లోని పఠనాసక్తిని అపహాస్యం చేస్తూ, వ్యాపారం ఒక్కటే లక్ష్యంగా, అవాంఛనీయమైన విషయాలతో కుప్పతెప్పలుగా వస్తూన్న పత్రికలు, పుస్తకాలు; అపమార్గంలో పయ నిస్తూన్న ఎలక్ట్రానిక్ మాధ్యమం మొదలైన అవరోధాలను అధిగమించి నిలబడగలిగాం!

మనిషిలోని మంచితనం, అంతఃకరణం పట్ల అచంచల విశ్వాసం –ఆధారంగానే చందమామ కొనసాగుతున్నది. మా విశ్వాసం నిరాధారం కాదని తరతరాల యువ పాఠకులు నిరూపిస్తున్నారు. మీరు మా విశ్వాసాన్ని గౌరవించినట్టే, మీరు మా మీద ఉంచిన విశ్వాసానికీ, మా పట్ల చూపుతూన్న ఆదరాభిమానాలకూ పాత్రులుగా ఉండడానికి ఎప్పటిలాగే కృషిచేయగలమని మా శ్రేయోభిలాషులందరికీ మనవి చేస్తున్నాం.

ఆనందకరమైన ఈ శుభ సమయంలో చందమామ అందరికీ శుభాకాంక్షలు తెలియజేస్తున్నది!

B. Viswanatha Reddi

ప్రచురణకర్త

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : బి. నాగిరెడ్డి


## స్వాతంత్ర్యసిద్ధి కోసం!

మనకు రాజకీయ స్వాతంత్ర్యం లభించి యాభై సంవత్సరాలు పూర్తయ్యాయి. ఈ సంవత్సరం దేశవ్యాప్తంగా స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలు జరుపుకుంటున్నాము.మన దేశానికి స్వాతంత్ర్యం దానంతట రాలేదు. స్వాతంత్ర్య సిద్ధికి మన పెద్దలు సంవత్సరాల తరబడి పోరాడారు. ఎన్నో త్యాగాలు చేశారు. మరెన్నో కష్టనష్టాలు అనుభవించారు.

పరాయి పాలనపట్ల మనదేశంలో ఎప్పుడు అసంతృప్తి బయలుదేరింది? మొట్టమొదట ఎప్పుడు ఎదురుతిరిగారు?

1857వ సంవ॥లో ఈ తిరుగుబాటు ఒక పద్ధతిప్రకారం జరిగింది. ఆ చారిత్రాత్మక సంఘటన గురించి, ఈసంచికనుంచి క్లుప్తంగా తెలుసుకుంటాం. మన రాజుల నుంచి అనుమతి పొందిన క్రయవిక్రయాల పరిధిని దాటి, ఈస్ట్ ఇండియా కంపెనీ దేశాన్ని కబళించడానికి కుట్రలతో, కుయుక్తులతో ప్రయత్నించిన నాటినుంచే ఈ నిరసనలు, తిరుగుబాట్లు ఆరంభమయ్యాయి.

భారత స్వాతంత్ర్య పోరాటంలో సాగిన వివిధ ఘట్టాలకు ఆధారంగా కొన్ని ఆదర్శాలు స్ఫూర్తినిచ్చాయి. వాటిని గురించి రానున్న సంచికలలో తెలుసుకుందాం!


| | | |
|---|---|---|
| సంపుటి : **101** | ఆగస్ట్ '97 | సంచిక: **2** |
| విడిప్రతి : **6** | సంవత్సర చందా | **72.00** |







Rs. 30/-




Rs. 40/-




Rs. 30/-




Rs. 30/-




Rs. 25/-




Rs. 30/-

## CHANDAMAMA BOOKS ARE ALREADY A LEGEND! THEY OPEN A NEW HORIZON ON THE WORLD OF LITERATURE FOR THE YOUNG

Added to the six titles by **Manoj Das** is the charming seventh–

**WHEN THE TREES WALKED**

by the inimitable story-teller **Ruskin Bond**




Rs. 30/-

Among the titles in the process of production are:

**STORY OF KRISHNA**
**STORY OF RAMA**
**STORY OF BUDDHA**



For details, write to:

**CHANDAMAMA BOOKS**
Chandamama Buildings
Vadapalani, Madras - 600 026.

వార్తలు-విశేషాలు:

# మన నూతన రాష్ట్రపతి

నిరుపేద కుటుంబంలో పుట్టినప్పటికీ, తమ అకుంఠిత దీక్ష, వదలని పట్టుదల, నిరంతర కృషి ఫలితంగా అత్యున్నత స్థితికి చేరుకునే వారు చాలా అరుదుగా ఉంటారు. అటువంటి అరుదైన వారిలో అమెరికా అధ్యక్షుడు అబ్రహాం లింకన్ ఒకరు. అలాగే జూలై 12వ తేదీ జరిగిన ఎన్నికలలో మన దేశానికి 11వ రాష్ట్రపతిగా అత్యధిక ఓట్ల మెజారిటీతో ఎన్నికయిన శ్రీ కె. ఆర్. నారాయణన్ ఒక మారుమూల గ్రామంలో, పేదకుటుంబంలో పుట్టి, కష్టపడి చదివి ఒక్కొక్క మెట్టుగా ఎదిగి, అత్యున్నత పదవిని చేపట్టాడు.



కోచెరిల్ రామన్ నారాయణన్ కేరళ రాష్ట్రం కోట్టయం సమీపంలోని ఉళవూర్ అనే గ్రామంలో 1920వ సం॥ నవంబర్ 27వ తేదీ జన్మించాడు. నారాయణన్ తండ్రి ఒక ఆయుర్వేద వైద్యుడు. ఏడ వయేట నారాయణన్‌ను ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలో చేర్పించారు. ఆయన ఉన్నతపాఠశాలలో చదువు కుంటున్నప్పుడు ఫీజుచెల్లించలేక నానా బాధలు పడేవాడు. అయినా, ఎంతో శ్రద్ధగా చదివి మంచిమార్కులతో ఉత్తీర్ణుడయ్యాడు.

తిరువనంతపురం యూనివర్సిటీ కాలేజీలో చేరి 1942వ సం॥లో ఆంగ్ల సాహిత్యంలో ప్రథమ శ్రేణిలో ప్రథమ విద్యార్థిగా డిగ్రీ పుచ్చుకున్నాడు. ఆయన కొంతకాలం ఒక టుటోరియల్ కళాశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేసి, ఆ తరవాత ఢిల్లీకివెళ్ళి ఇండియన్ ఓవర్‌సీస్ విభాగంలో అసిస్టెంటుగా చేరాడు. ఆ పిమ్మట ఆ ఉద్యోగాన్ని వదిలి అంతకన్నా తక్కువ జీతంతో ఒక పత్రికలో చేరాడు. కొంతకాలం 'హిందూ' పత్రికలోనూ, బొంబాయినుంచి వెలువడే 'టైమ్స్ ఆఫ్ ఇండియా' పత్రికలోనూ సబ్‌ఎడిటర్‌గా పని చేశాడు. 'కౌటిల్య' అనే కలం పేరుతో ఆయన వ్యాసాలు రాసే వాడు. 1944 ఏప్రిల్ 10వ తేదీ ఆయన మహాత్మా గాంధీని ఇంటర్వ్యూ చేశాడు. ఆరోజు గాంధీజీ మౌనవ్రతంలో ఉండడం వల్ల, నారాయణన్ ప్రశ్నలకు వాడేసిన పోస్టల్ కవర్లమీద ఆయన సమాధానాలు రాసి ఇచ్చాడు. నారాయణన్ వాటిని ఇంకా జాగ్రత్తగా భద్రపరచి ఉన్నాడు.

1945వసం॥లోఆయన ఇంగ్లాండుకు వెళ్ళి 'లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్'లో చేరి ప్రొఫెసర్ హెరాల్డ్ జె. లాస్కీకి అభిమాన పాత్రుడయ్యాడు. 1948వ సం॥లో భారత దేశానికి తిరిగి వచ్చాడు. జవహర్‌లాల్ నెహ్రూ ఆయనకు విదేశాంగ శాఖలో ఉద్యోగం ఇచ్చి, బర్మా (మియాన్‌మార్) రాజధాని రంగూన్‌లో వున్న భారత రాయబార కార్యాలయానికి పంపాడు. ఆ తరవాత ఆయన జపాన్, బ్రిటన్, వియత్నాం దేశాలలోని రాయబార కార్యాలయాలలో పని చేశాడు. ఆ పిమ్మట థాయ్‌లాండ్, టర్కీ, చైనా దేశాలలో భారత రాయబారిగా ఉన్నాడు.

1978వ సం॥లో— ప్రభుత్వ ఉద్యోగ పదవీ విరమణ చేసి, ఢిల్లీలోని జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయ వైస్ ఛాన్స్‌లర్ పదవిని చేపట్టాడు. 1980వ సం॥లో ప్రధాని ఇందిరాగాంధీ ఆయన్ను అమెరికాకు భారతరాయబారిగా పంపారు.

రాజీవ్‌గాంధీ ప్రధాన మంత్రి అయ్యాక, ఆయన నారాయణన్ రాజకీయ రంగ ప్రవేశాన్ని ప్రోత్సహించాడు. కేరళ రాష్ట్రం ఒట్టపాలం నుంచి కాంగ్రెస్ అభ్యర్థిగా లోక్‌సభకు ఎన్నికయ్యాడు. ప్రణాళిక, విదేశాంగ శాఖల ఉపమంత్రిగానూ, ఆ తరవాత విజ్ఞాన, సాంకేతిక శాఖల ఉపమంత్రిగానూ పదవీ బాధ్యతలు నిర్వహించాడు. ఒట్టపాలం నుంచే ఆయన మళ్ళీ రెండుసార్లు పార్లమెంటుకు ఎన్నికయ్యాడు. ఆ తరవాత ఆయన భారత ఉపరాష్ట్రపతిగా ఎన్నుకోబడ్డాడు.

ప్రస్తుతం దేశంలో అత్యున్నతమైన పదవిలో ఉన్నప్పటికీ ఆయన చిన్నవాటి జీవితాన్ని మరిచిపోలేదు. "ప్రజలు నా పట్ల చూపిన గౌరవాదరాలను సవినయంగా స్వీకరిస్తున్నాను. వారి అభిలాషలనూ, ఆకాంక్షలనూ నెరవేర్చడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను," అన్నాడాయన!



# అనుకున్నది-అనుకోనిది

చంద్రపురిరాజు చంద్రసేనుడికి మొండి వాడని పేరు. ఆయన తనకు తోచింది చేస్తాడుగానీ ఇతరుల సలహాలు తీసుకోడు. ఆస్థానంలో మంత్రి అంటూ వుండాలి గనక, ముసలిమంత్రిని పదవిలో కొనసాగనిస్తున్నాడు. అయితే, ఆ మంత్రిని ఆయన ఏనాడూ సంప్రతించింది లేదు; ఏ విషయంలో గాని సలహాలు అడిగింది లేదు.

ఇలా వుండగా–రాజ్యంలో అధిక శాతం ప్రజలు సుఖంగానూ, సంతృప్తిగానూ లేరన్న సమాచారం చారులద్వారా చంద్రసేనుడికి తెలిసింది. ఆవిషయమై ఆయన మంత్రి తోగానీ, మరెవరితో గానీ చర్చించలేదు. ప్రజల అసంతృప్తికి కారణం స్వయంగా తెలుసుకోవాలని, ఆయన ఒకరోజు రాత్రి మారువేషంలో నగరపర్యటనకు బయలు దేరాడు.

ఆయన ఒక ఇరుకు వీధిగుండా పోతూ, ఒక పెంకుటింటిలోంచి భార్యా భర్తల సంభాషణ వినిపించి, కిటికీపక్కన దాగి విన్నాడు.

"మూడు మాసాలుగా చూస్తున్నాను, మీరు ఎప్పుడూ విచారంగా కనిపిస్తున్నారు. కారణం ఏమిటి?" అని భార్య భర్తను అడుగుతున్నది.

"ఏం చెప్పమంటావు! అనుకున్నది ఒక్కటీ జరగడం లేదు," అన్నాడు భర్త.

ఆ జవాబుతో ప్రజలు ఎందుకు సుఖంగా లేరో అర్థమైపోయినట్టు తోచింది, చంద్రసేనుడికి. వాళ్ళు అనుకున్నవి జర గడంలేదు!

అంతఃపురానికి తిరిగి వచ్చిన చంద్ర సేనుడు, ఆ రాత్రంతా యోచించి– మర్నాడు కొందరిని ఏం అనుకుంటున్నారో అడిగి, ఆ విధంగా చేసి, వాళ్ళు ఆనంద

మాచిరాజు కామేశ్వరరావు

పడుతున్నారో లేదో గమనించాలని నిశ్చ యించుకున్నాడు.

మర్నాడు ఉదయం చంద్రసేనుడు స్నానం ముగించి వచ్చేసరికి, సేవకుడు వెండిలోటాలో పాలు తెచ్చి, ఆయనకు అందించాడు. అయితే, ఇచ్చేముందు వాడు సరిగా చూసినట్టు లేదు. పాలువిరిగి వున్నాయి. ఆలస్యంగా విషయం గ్రహించిన సేవకుడు హడలిపోయాడు.

చంద్రసేనుడు, వాడి ముఖంలోకి సూటిగా చూస్తూ, "ఇప్పుడు నువ్వు మనసులో ఏం అనుకుంటున్నావో చెప్పు!నిజమే చెప్పాలి సుమా," అన్నాడు.

"వేడిపాలు మొహాన కొడతారేమో అని, అనుకుంటున్నాను, మహారాజా!" అన్నాడు వాడు.



వాడనుకున్నది చేశాడు చంద్రసేనుడు. సేవకుడు రోదిస్తూ వెళ్ళిపోయాడు. ఆ రోజు సభలో ఒక చిల్లరదొంగను ప్రవేశ పెట్టారు. అతడి నేరం రుజువయింది. చంద్రసేనుడు, అతడికి శిక్ష వేయకుండా ఆనందపరచాలని, "ఇప్పుడు నేనేం చేస్తానని భావిస్తున్నావు? నిజం దాచకుండా చెప్పు," అన్నాడు.

"కొరడా దెబ్బల శిక్ష వేస్తారేమో అని భయంగా వుంది, మహారాజా!" అన్నాడు దొంగ.

అతడికి కొరడాదెబ్బల శిక్ష విధించాడు, చంద్రసేనుడు.

ఆ రాత్రి మహారాణి, చంద్రసేనుడికి తాంబూలం ఇస్తూ, "ఒకసారి పుట్టింటికి వెళ్ళి, మా అమ్మా నాన్నలను చూసి వస్తాను, అనుమతిస్తారు కదూ!" అని అడిగింది.

చంద్రసేనుడు తాంబూలం సేవిస్తూ, "నానుంచి ఎలాంటి జవాబు వస్తుందని అనుకుంటున్నావు?" అని నవ్వుతూ అడిగాడు.

"మా వాళ్ళు రెండు మాసాల క్రితమే వచ్చి వెళ్ళారు కాబట్టి, ఇప్పుడు వద్దనే అంటారని భావిస్తున్నాను," అన్నది రాణి.

"అవును, అదే అంటున్నాను!" అన్నాడు చంద్రసేనుడు.

రాణి భారంగా నిట్టూర్చి పడకగదిలోకి వెళ్ళిపోయింది.

చంద్రసేనుడు ఇంతవరకూ జరిగిన సంఘటనలన్నీ మననం చేసుకున్నాడు. అందరూ అనుకున్నది, అనుకున్నట్టుగా



జరిగేలాచూశాడు. అయితే, ఎవరూ ఆనం దించినట్టులేదు. అందువల్ల, ప్రజల విచా రానికి మరేదో కారణం వుండి వుండాలి!

ఆరాత్రి మళ్ళీ మారువేషంలో నగర సంచారానికి బయలుదేరాడు, చంద్ర సేనుడు.

ఈసారి ఒక భవనం ఆరుబయట పచ్చికలో కుర్చీలు వేసుకుని, కబుర్లు చెప్పుకుంటున్న భార్యాభర్తల మాటలు, దాపులవున్న చెట్ల చాటున నిలబడి విన్నాడు, రాజు.

"ఈ మధ్య మీలో మునుపటి ఉత్సాహం కనిపించడం లేదు. ఏదో పోగొట్టు కున్నట్టుగా — విచారంగా వుంటున్నారు. కారణం ఏమిటి?" అని అడుగుతున్నది భార్య.

దానికి భర్త, "ఈ మధ్య బతుకు గానుగ ఎద్దు చందంగా తయారయ్యింది. ఏ మార్పూ లేదు. అనుకోనిదేదో జరిగితేనే గదా ఆనందం!", అన్నాడు.

అనుకోనిది జరిగితే ప్రజల విచారం తొలగ గలదని అర్థం చేసుకున్నాడు, చంద్రసేనుడు. మర్నాడు, ఎదుటివారి మనసులో ఏం వున్నదో అడిగి తెలుసు కుని, అందుకు వ్యతిరేకంగాచేసి, వాళ్ళను ఆనందపరచాలని నిశ్చయించుకున్నాడు.

మర్నాడు సభకు వెళ్ళే సమయంలో, సేవకుడు అందించిన దుస్తులకు భుజం పక్కన చిరుగున్నది. ధరించాకే ఆచిరుగు కనబడింది. సేవకుడు అదిరిపడి, "క్షమిం చండి, మహారాజా! వేరే దుస్తులు తెస్తాను," అన్నాడు.

"ఇప్పుడు నేనేం చేస్తానని నువ్వను కుంటున్నావు?" అని అడిగాడు చంద్ర సేనుడు.

"నన్ను శిక్షిస్తారు. ఈ చిరుగుల దుస్తు లతో సభకు మాత్రం వెళ్ళరు," అన్నాడు సేవకుడు.

"నిన్ను శిక్షించను. ఇవే దుస్తులతో సభకు వెళతాను," అంటూ చంద్రసేనుడు సభకు వెళ్ళిపోయాడు.

సభా కార్యక్రమం జరుగుతూండగా, కునికిపాట్లు పడుతున్నాడు మంత్రి. చంద్ర సేనుడు అది గమనించి పక్కవారికి సైగ చేసి, మంత్రి కునికిపాట్లనుంచి బైట పడేలా చేశాడు.

"క్షమించండి, మహారాజా!" అన్నాడు మంత్రి ఆసనంలో సర్దుకు కూర్చుంటూ.

"ఇప్పుడు నేనేం అంటానని భావిస్తు న్నారు మీరు, మహామంత్రీ!" అన్నాడు చంద్రసేనుడు.

ఊహించని ఈప్రశ్నకు మంత్రి ఆశ్చర్య పడుతూ, "ఒక నిద్రగొట్టు మంత్రిగా వున్నం దుకు సిగ్గు పడుతున్నానని అనవచ్చు మీరు," అన్నాడు చంద్రసేనుడు.

మంత్రి అనుకున్న దానికి విరుద్ధంగా చెప్పాలని, "అదేం లేదు. మీలాంటి వారు మంత్రిగా ఉన్నందుకు గర్వపడుతు న్నాను," అన్నాడు చంద్రసేనుడు.

సభ గొల్లుమన్నది. రాజు వ్యంగ్యంగా ఆ మాట అన్నాడని భావించి అవమా నంతో కుంగిపోయాడు, మంత్రి.

ఆసాయంత్రం చంద్రసేనుడు ఉద్యాన వనంలో విహరిస్తూండగా, గాలికి ఎగిరి వచ్చి చిన్న ముళ్ళమండ ఆయన కాలికి తగిలింది. ముసలితోటమాలి పరుగున వచ్చి, దాన్ని దూరంగా విసిరివేసి, "క్షమిం చండి, మహారాజా! ఇటువంటిది మళ్ళీ జరక్కుండా జాగ్రత్తపడతాను," అన్నాడు వినయంగా.

"ఈ జరిగిపోయిన దానికి, నేనేం చేయబోతున్నానని నువ్వు ఊహిస్తున్నావు," అని అడిగాడు రాజు.

తోటమాలి ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి, "గులాబీలున్న తోటలో ఇలాంటి ముళ్ళు వుండడం సహజం అనుకుంటారు. ముసలివాణ్ణి కాబట్టి ఉద్యానవనంలో సరిగా పనిచేయలేక పోతున్నానని భావించి, ఉద్యోగంలోంచి మాత్రం తీసివెయ్యరు," అన్నాడు.



"లేదు, ఆ పనే చేయబోతున్నాను. నీ స్థానంలో యువకుడొకణ్ణి తోటమాలిగా నియమిస్తాను," అంటూ, చంద్రసేనుడు, తోటమాలి కన్నీళ్ళు పట్టించుకోకుండా భవనంకేసి నడిచాడు.

ఆ రాత్రి రాణి మరొకసారి భర్త వద్ద, తన పుట్టింటి ప్రయాణపు ప్రస్తావన తెచ్చింది.

"మా అమ్మకు ఆరోగ్యం బాగా లేనట్టు రాత్రి కలవచ్చింది. ఒకసారివెళ్ళి చూసివస్తాను," అన్నదామె.

"నానుంచి ఎలాంటి జవాబు వస్తుం దని అనుకుంటున్నావు?" అని ప్రశ్నిం చాడు చంద్రసేనుడు.

రాణీ నవ్వి, "పదేపదే అడుగుతున్నా నని వెళ్ళమనే అంటారు!" అన్నది.

"అదేంలేదు. నువ్వు పుట్టింటికి వెళ్ళ బోవడంలేదు!" అన్నాడు చంద్రసేనుడు.

రాణి పెద్దగా నిట్టూర్చి విచారంగా శయ్యామందిరంకేసి నడిచింది. ఆమె విచారపడడం చూశాక, చంద్రసేనుడు ఆలోచనలో పడ్డాడు. అనుకోనివి జరిగినా ఎవరూ సంతోషపడినట్టు లేదు! మరి ఏంచేస్తే ప్రజలకు సుఖ, సంతోషాలు లభ్యమవుతాయి? ఈ ప్రశ్నకు జవాబు దొరకక, ఆరాత్రంతా ఆయనకు నిద్రపట్ట లేదు.

అర్ధరాత్రి గడిచినా, ఇంకా శయ్యా మందిరంలో పచార్లుచేస్తున్న భర్తను చూసి, రాణి, "నిద్రపట్టడంలేదా? ఏం ఆలోచిస్తు న్నారు?" అని ప్రశ్నించింది.

మొదటిసారిగా తన ఆలోచనల గురించి భార్యకు తెలియజేశాడు, చంద్ర సేనుడు. ఆయన జరిగినదంతా ఆమెకు చెప్పి, "అనుకున్నవి జరిగిన వాళ్ళూ ఆనంద పడలేదు; అనుకోనివి జరిగినా సంతోష పడలేదు. ఇక, ఈ ప్రజల విచారం ఏం చేస్తే తొలగుతుందో అర్థం కావడం లేదు!" అన్నాడు.

రాణీ తేలిగ్గా నవ్వేస్తూ, "ఎవరైనా మనసులో అనుకున్నవీ, అనుకోనివీ కూడా- అవసరమైనవీ, ఆనందాన్నిచ్చేవీ కాకపోవచ్చు. రాజు ప్రజలకు తండ్రి లాంటి వాడు.ప్రజలకు కనీస అవసరాలు తిండి, బట్ట, నివాసం. అవి అందరికీ సమకూర్చినప్పుడు — చేతినిండా పని, మనసు నిండా ఆనందం! మీరాపని చేయగలిగిననాడు, ప్రజల్లో విచారగ్రస్తు లెవరూ వుండరు!" అన్నది.

దానితో చంద్రసేనుడికి, తానింత కాలంగా పరిపాలనా విషయాల్లో చేస్తున్న తప్పిదమేమిటో తెలిసి వచ్చింది. తెల్లవార గానే ఆయన మంత్రినీ, ఇతర ముఖ్యోద్యో గులనూ సమావేశపరిచి, వాళ్ళతో సంప్ర దించి, ప్రజలందరికీ కనీస అవసరాలు సమకూర్చ గల ప్రణాళికలు తయారు చేయించాడు.

ఆ తర్వాత ఏనాడూ ప్రజలు సుఖంగా లేరన్న సమాచారం చారులు తీసుకు రాలేదు. రాజ్యంలో మంత్రిపదవి కేవలం అలంకార ప్రాయమన్న అపవాదూ పోయింది.





# మహారాజు మహారాజే!

ప్రవాళదేశపు మహారాజుగారు స్నానం చేస్తూ కాలు జారి పడిపోయాడు. కాలు బెణికింది. కాలు కదపలేక పోయాడు. ఆస్థానవైద్యులు వచ్చి పసరు పూసి కట్టు వేశారు. రాజుగారు కనీసం పక్షం రోజులు పూర్తి విశ్రాంతి తీసుకోవాలన్నారు. కాలు కదపకూడదు మరి!

మహారాజుగారు మంత్రిని పిలిచి, రాచ కార్యాలు తన తరఫున మంత్రినే చూసుకో మన్నాడు. ముఖ్యమైన నిర్ణయాలు తీసుకునే బాధ్యతను కూడా అప్పగించాడు.

ఒక వారంరోజులపాటు మంత్రే మహా రాజుగారి తరఫున పరిపాలన సాగించాడు. రాజ్యంలో మహారాజుగారు పరిపాలిస్తున్న ప్పటి పరిస్థితులకూ, ఇప్పటి పరిస్థితులకూ తేడా ఏం లేదు. అసలే అంతో ఇంతో అహంకారి అయిన మంత్రికి, ఇది చూసి మరింత అహంకారం పెరిగింది.

"ఇంత చక్కగా నేను రాజ్యపాలనచేస్తు న్నాను. ఇంతకాలంగా రాజుగారికి సలహా లిస్తున్నది, నేనే కదా! రాజుగారు కేవలం ఉత్సవవిగ్రహం వంటివాడు. రాజుగారు లేకపోయినా రాజ్యం మామూలుగానే వుంటుంది," అనుకుని మంత్రి సర్వాధికా రిలా ప్రవర్తించసాగాడు.

ఒకరోజున, నగరంలో కూలీ నాలీ చేసుకు బతికే పేదలగుడిసెలు అంటు కుని, అరవైదాకా భస్మమయ్యాయి. వంద మందికి పైగా నిరాశ్రయులయ్యారు. మంత్రి, విషయం తెలిసిన వెంటనే ఆ ప్రదేశానికి వెళ్ళి, అందరికీ మళ్ళీ గుడిసెలు కట్టించి ఇస్తానని ప్రకటించి, వారంరోజు లకు సరిపడా వాళ్ళకు బియ్యం ఉచితంగా ఇప్పించాడు.

ఇంత చేసినా, కూలివాళ్ళు అసంతృ ప్తిగా వున్నట్టు కనిపించారు. మంత్రి

ఇంద్రగంటి నరసింహమూర్తి

వాళ్ళను, "చెప్పండి! ఇంకా ఎలాంటి సాయం కావాలి మీకు?" అని అడిగాడు.

"ఒకసారి మహారాజుగారి దర్శనం చేసుకునే అవకాశం ఇప్పించండి. ఈ కష్ట సమయంలో మాకు, వారి ఓదార్పు కావాలి. మాకే కష్టం వచ్చినా మమ్మల్ని ఆదుకునే మహారాజుగారిని చూడాలని వుంది," అని వాళ్ళందరూ కోరారు.

ఇది విని మంత్రి ఆశ్చర్యపోయి, ఏమి చేయడమా అని ఆలోచిస్తున్నంతలో, మహారాజుగారే స్వయంగా – జోడు గుర్రాలను పూన్చి రథంలా అలంకరించి వున్న చిన్న వాహనంలో అక్కడికి వచ్చారు. ఆయనను చూస్తూనే, అప్పటి వరకూ దీనంగా వున్న కూలీల ముఖాల్లో ఆనందం వెల్లివిరిసింది.

అందరూ మహారాజుకు చేతులు జోడించారు. మహారాజుగారు చుట్టూ ఒకసారి కలయచూసి, "మీ ఇళ్ళు పరశురామ ప్రీతి అయినట్టు ఇప్పుడే విన్నాను. ఎలా వున్నారు?" అని అడిగాడు.

అందరూ ఆయన వాహనం చుట్టూ చేరి, తమ కొచ్చిన కష్టం గురించి చెప్పుకుని, మహారాజుగారి ఆరోగ్యం గురించి తెలుసుకున్నారు.

మహారాజుగారు అందర్నీ ఓదార్చి, వారికి కొత్తగా ఇళ్ళు కట్టిస్తానని హామీ ఇచ్చి తిరిగివెళ్ళాడు.

ఇదంతా చూసిన మంత్రి ఇంటికి వెళ్ళి దీర్ఘాలోచనలో పడ్డాడు. ఆయనకు ఆలోచించగా ఆలోచించగా ఒక విషయం అర్థమైంది; ప్రజలంతా మహారాజు క్షేమంగా వుండాలనీ, ఆయన పాలనలో తామంతా సుఖించాలనీ కోరుకుంటారు. వాళ్ళ దృష్టిలో మంత్రితో సహా మిగిలిన అందరూ రాజాజ్ఞలు పాటించవలసిన సేవకులు మాత్రమే! తాము తప్పు చేస్తే రాజు దండిస్తాడన్న భయం, ఆపదలో ఆదుకుంటాడన్న విశ్వాసం వాళ్ళను సమైక్య పరిచి, రాజ్యాన్ని ప్రశాంతంగా వుండేటట్టు చేస్తాయి!

ఈ వాస్తవాన్ని గ్రహించిన మంత్రి, మహారాజుకు మరింత సన్నిహితుడుగా వుంటూ, రాజ్యాన్ని సుభిక్షంగా పాలించడంలో రాజుకు చేదోడు వాదోడుగా మెలగసాగాడు.





# సామ్రాట్ అశోక

## 8

[తండ్రి బిందుసారుడి ఆజ్ఞానుసారం అశోకుడు అవంతీ రాజధాని ఉజ్జయినికి బయలు దేరాడు. ఆరోజు సాయంకాలం మార్గమధ్యంలోని విదిశాలోయలో విడిది చేశాడు. తెల్ల వారుజామున అశోకుడు ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ నడుస్తూపోయి అగాథంలోకి అడుగు వేయబోతూండగా, శాక్యనాయకుడి కుమార్తె విదీశ కాపాడింది. ఆ రాత్రి ఇద్దరు యువతులు అశోకుణ్ణి హత్యచేయడానికివచ్చి పట్టుబడ్డారు. —తరవాత]

పట్టుబడిన నాట్యకత్తెల ఎదుట వాళ్ళకు తోడుగా వచ్చిన పురుషులను యశుడు నానా హింసలు పెట్టి బాధించాడు. ఆ తరవాత అతడు స్త్రీలకేసి తిరిగి, "మీరు యువరాజును హతమార్చడానికి వచ్చారు. దానికి మరణశిక్ష తప్పదు. మీకు ఎలాగూ చావుతప్పదు. చావడానికి ముందు నిజం చెప్పండి. కనీసం నరకంలోనైనా తక్కువ శిక్ష అనుభవించగలరు!" అన్నాడు.

నాట్యకత్తెలు బెదురుతూ ఒకరినొకరు చూసుకున్నారు. వాళ్ళల్లో ఒకతె, "అయ్యా, మా మీద కరుణ చూపండి. మాకు నరకం అంటే భయం లేదు. దానిని మేమెప్పుడూ చూడలేదు. కాని మీరు పెట్టే బాధలు భరించలేకుండా ఉన్నాం. మాకు చావంటే భయం. మమ్మల్ని హింసించి చంపడంలో మీరు సాధించే దేమీ ఉండదు. ప్రాణాలతో వదిలిపెడితే

మునుముందు మీకు ఉపయోగపడవచ్చు. ఇప్పుడు నిజం చెప్పేస్తాం," అన్నది.

"మొదట నిజం చెప్పండి. ఆ తరవాత మీ చావుబతుకుల సంగతి యువరాజు నిర్ణయిస్తాడు!" అన్నాడు యశుడు.

"రాజధాని పాటలీపుత్రం నుంచే మేము యువరాజునూ, ఆయన పరివారాన్నీ వెన్నంటి వచ్చాం. మేము నాట్యకత్తెలం. మాకు డబ్బిచ్చిన వాళ్ళు చెప్పినట్టు చేయడం మా వృత్తి. మమ్మల్ని పంపిన వారు యువరాజుకు శత్రువులేగాని, మేము ఆయనకు శత్రువులం కాము," అన్నది ఒక నాట్యకత్తె.

"డబ్బిచ్చి మిమ్మల్ని పంపిన యువ రాజు శత్రువులు ఎవరు?" అని అడిగాడు యశుడు.

"మాకు ప్రాణభిక్ష పెడతామని ముందు మాట ఇవ్వండి!" అన్నది నాట్యకత్తె.

"షరతులు వద్దు. నిజం చెప్పు, లేదా చంపేస్తాను," అని హెచ్చరించాడు యశుడు కోపంగా.

"అయ్యా! రాకుమారుడు అశోకుణ్ణి హతమార్చమని మాకు డబ్బిచ్చి పంపింది మరెవరోకాదు; బిందుసార చక్రవర్తి జ్యేష్ఠ కుమారుడూ, కాబోయే రాజూ అయిన సుశేముడు!" అన్నది నాట్యకత్తె.

ఆ మాట విని, "నిజంగానా!" అంటూ అశోకుడు గుడారం నుంచి వెలుపలికి వచ్చాడు.

"ముమ్మాటికీ నిజం ప్రభూ!" అంటూ, సుశేముడు తమను రాజమందిరానికి రహస్యంగా పిలిపించినదీ, వెయ్యి బంగారు



నాణాలతో పాటు మనిషికొక వజ్రపుటుంగరం బహూకరించినదీ, చెప్పినపని విజయవంతంగా నెరవేర్చినట్టయితే మరింత ధనం ఇస్తామని ఆశ చూపినదీ పూస గుచ్చినట్టు తెలియజేశారు నాట్యకత్తెలు. వాళ్ళ దగ్గరున్న వజ్రపుటుంగరాలూ, చెప్పిన రాజోద్యోగుల పేర్లూ వాళ్ళు నిజమే చెబుతున్నారనడానికి సాక్ష్యాధారాలుగా తోచాయి. అశోకుడూ, యశుడూ వాళ్ళ మాటలు నమ్మారు.

విచారణ పూర్తయిన వెంటనే అశోకుడు చప్పట్లు చరిచాడు. దృఢకాయులైన ముగ్గురు సైనికులు వచ్చి అశోకుడికి నమస్కరించారు. "వీళ్ళను ఇక్కడి నుంచి తీసుకువెళ్ళి, పంపవలసిన చోటికి పంపండి!" అన్నాడు అశోకుడు.



"మమ్మల్ని ఎక్కడికి పంపుతారు ప్రభూ!" అని అడిగారు నాట్యకత్తెలు.

"మీరు నన్ను పంపాలనుకున్న చోటికి!" అన్నాడు అశోకుడు.

"అయ్యో! వద్దు ప్రభూ, వద్దు!"అంటూ హృదయ విదారకంగా విలపించసాగారు నాట్యకత్తెలు.

"ఏడవకండి! దురదృష్ట వంతులైన యువతులారా, ఏడవకండి! శాక్యముని గౌతమ బుద్ధుణ్ణి ప్రార్థించండి. ఆయన అపారకరుణ యువరాజును కాపాడినట్టే మిమ్మల్ని కూడా కాపాడుతుంది!" అన్న మధురకంఠస్వరం వినిపించింది.

అందరూ అటు కేసి తిరిగి చూశారు. విదీశాదేవి మందహాసం చేస్తూ అక్కడికి వచ్చింది.

"చెల్లాయీ! వాళ్ళలో లేనిపోని ఆశలు కలిగించవద్దు!" అన్నాడు యశుడు.

"నేను వాళ్ళకు ఆశలు కల్పిస్తున్నానా! వాళ్ళను ప్రాణాలతో విడిచిపెడతాననినువ్వే ఆశ చూపావు. ఇంతలో ఆ మాట మరిచి పోవద్దు!" అన్నది విదీశ.

"వివేకవంతురాలివి! ఇలా అర్థ రహితంగా మాట్లాడటమేమిటి? నేనెప్పుడు వాళ్ళను ప్రాణాలతో విడిచి పెడతానన్నాను? అయినా, ప్రాణాలతో వదలిపెట్టడానికి నేనెవర్ని?" అన్నాడు యశుడు కాస్త కటువుగా.

"నిజం చెప్పండి, లేకుంటే చంపేస్తానని నువ్వే వాళ్ళను హెచ్చరించావు. నిజం చెబితే ప్రాణాలతో వదిలి పెడతాననే కదా ఆమాటకు అర్థం! ఇప్పుడెలా నువ్విచ్చిన మాట తప్పుతావు?" అన్నది విదీశ.

"అద్భుతం!" అంటూ అశోకుడు చప్పట్లు చరుస్తూ, యశుడికేసి తిరిగి, "ఇటువంటి తెలివైన యువతిని సోదరిగా పొందిన నువ్వు చాలా అదృష్టవంతుడివి మిత్రమా!" అన్నాడు.

యశుడు అవాక్కయ్యాడు. విదీశ సంతోషంతో ఒక్క నిమిషం ఉక్కిరిబిక్కిరయింది. విదీశ మాటలు వినగానేనాట్యకత్తెల కళ్ళు కృతజ్ఞతతో నిండాయి.

యశుడు తేరుకుని అశోకుణ్ణి, "ఈ మోసకత్తెలను ప్రాణాలతో వదిలి పెట్టాలని తమరు నిజంగానే ఆశిస్తున్నారా, యువరాజా!" అని అడిగాడు.

"విదీశ కోరిందంటే అలా చెయ్యక తప్పదు మరి! అయితే, ఆమె అందుకు

తగిన ధర చెల్లించాలి!" అంటూ అశో కుడు విదీశ కేసి చూశాడు.

"నా శక్తికి మించనిదైతే సంతోషంగా చెల్లిస్తాను, యువరాజా! అదేమిటో చెప్పండి!" అన్నది విదీశ.

"ఆ ధర నువ్వు మాత్రమే చెల్లించ తగినది. ఎంతో అమూల్యమైనది. చెప్పాలంటే మాట రావడం లేదు!" అని కొంతసేపు ఆగి, "ఆ సంగతి మీ అన్న యశుడితో చెబుతాను," అన్నాడు అశోకుడు.

యశుడు చిన్నగా నవ్వుతూ విదీశకేసి చూశాడు. ఆమె తలవంచుకుని అక్కడి నుంచి వెళ్ళింది.

నాట్యకత్తెలనూ, మగ ఖైదీలనూ దూరంగా తీసుకు వెళ్ళమని అశోకుడు భటులను ఆజ్ఞాపించాడు.



* * *

యువరాజు అశోకుడు తమ కుమార్తె విదీశను వివాహమాడడానికి ఇష్టపడు తున్నాడని, యశుడు చెప్పడం విని, శాక్య నాయకుడు, ఆయన భార్య మొదట నమ్మలేకపోయారు. ఆ తరవాతఆశ్చర్యంతో ఏమీ మాట్లాడలేక మౌనం వహించారు. అప్పుడు యశుడు, "యువరాజు అశోకుడు ఉన్నత వంశానికి చెందినవాడు. అందరు రాజకుమారుల్లాగే ఆయనకూ రాజ్యకాంక్ష అధికార ప్రీతి ఉన్నాయి. అంతేగాని, ఆయన స్వభావం చాలా ఉన్నతమైనదనీ, ఆయన సున్నితమనస్కుడనీ అందరూ చెప్పకుంటారు. నా అభిప్రాయం కూడా అదే. సుసంపన్నమైన అవంతీ ప్రాంతానికి ఆయన రాజప్రతినిధిగా అధికారంచేపట్ట నున్నాడు. ఆయన్ను వివాహ మాడినట్ట యితే, మన విదీశ దాదాపు రాణి అయి నట్టే," అన్నాడు.

అంతలో అక్కడికి వచ్చిన విదీశ, "ఇదా నువ్వు, నీ సొంత చెల్లెలుగా భావిస్తూన్న నన్ను అర్థంచేసుకున్న తీరు? రాణి కావడంలోనే నా ఆనందం ఉన్నదని నువ్వు భావిస్తున్నావా?" అని అడిగింది.

యశుడు వెంటనే ఏమి చెప్పడానికీ తోచక ఊరుకుని, ఆ తరవాత చిన్నగా నవ్వుతూ, "అవును, చెల్లెమ్మా! తనచెల్లెలు రాణిఅయితేచూసిఆనందించనిఅన్నయ్య ఉంటాడా? ఇందులో తప్పేమిటి? అయినా, యువరాజు కోరికను అంగీకరించడానికి నువ్వెందుకు వెనుకాడుతున్నావో నా కర్థం కావడంలేదు!" అన్నాడు.



విదీశ తల్లి, "అవును నాయనా, మొదట యువరాజు నిజంగానే మన అమ్మాయిని వివాహమాడడానికి కోరాడా అని నమ్మ లేకపోయాను. మన అమ్మాయి మామూలు ఆడపిల్లకాదని నానమ్మకం. జరిగిన సంఘ టలను చూస్తూంటే ఆ సంఘటనలవెనక ఏదో దైవనిర్ణయం ఉన్నట్టు నా కనిపిస్తు న్నది. యువరాజు మన ఊళ్లోనే ఎందుకు బసచేయాలి? అతడు అగాథంలో పడిపో కుండా ఆపడానికి విదీశను అక్కడికి పంపిన వారెవరు? అశోకుణ్ణి హతమార్చడా నికి వెళుతూన్న హంతకులు మీకళ్ళ బడడమేమిటి? అంతా విచిత్రంగా ఉన్నది కదా!" అన్నది.

అంతవరకు మౌనంగా ఉన్న విదీశ తండ్రి, "నా కుమార్తె జీవితం యువరాజు జీవితంతో ముడిపడి ఉన్నదని నాకనిపిస్తు న్నది. లేకుంటేఒక్కరేయీ, పగలూ వ్యవ ధిలో రెండుసార్లు ఆమె యువరాజు ప్రాణాలను కాపాడి ఉండదు!" అన్నాడు.

వాళ్ళ మాటలకు విదీశ కళ్ళనుంచి బాష్పాలు పెల్లుబికాయి. ఆమె మౌనంగా ఇంటినుంచి వెలుపలికి వచ్చి, చేతులు జోడించి పైకి చూస్తూ, "తథాగత బుద్ధా! ఏమిటీ పరీక్ష? అల్లకల్లోలంగా ఉన్న నా మానసికస్థితి నుంచి బయటపడే మార్గం చూపించు. సన్యాసిని జీవితాన్ని స్వీకరించి, నువ్వు చూపిన మార్గంలో పయనించి, నిర్వాణం పొందాలన్నదే నా అభీష్టం. అధికారం కోసం, ఐహిక సుఖాలకోసం నేనెన్నడూ ఆశలు పెంచుకోలేదు. ఎటూ తేల్చుకోలేని ఇటువంటి డోలాయమాన స్థితిని నేను ఎందుకు ఎదుర్కోవలసి వచ్చింది?" అని ప్రార్థించింది.

కొంతసేపు అక్కడ నిశ్శబ్దం ఆవరిం చింది. ఆ తరవాత ఆమె యశుడికేసి తిరిగి, "నాకు మంచి ఏదో, చెడు ఏదో తెలియడం లేదు. నిజానికి ఈ విష యంలో నా తల్లి దండ్రుల సలహాపై కూడా నాకు నమ్మకం లేదు. ఎందు కంటే వాళ్ళు నా ఐహిక సుఖాలనే కోరు కుంటారు. తమ కుమార్తె యోగ్యుడైన యువరాజును పెళ్ళాడడం కన్నా మించిన అదృష్టం ఉంటుందని ఏ తల్లి దండ్రు లైనా ఊహించ గలరా? ఈ విషయంలో నాకు సరైన సలహా ఇవ్వగల వాడు గురుదేవుడు ఉపగుప్తుడు ఒక్కడే!" అన్నది.

"మంచిది, అలాగే ఆయన సలహా తీసుకో," అన్నాడు యశుడు.

ఆమె తల్లిదండ్రులు కూడా అందుకు సమ్మతించారు.

ఉపగుప్తుడు మరునాడే విదీశకు రానున్నాడని తెలిసింది. యశుడి ద్వారా విదీశ అభిప్రాయం తెలుసుకున్న అశోకుడు అంతవరకు వేచి ఉండడానికి సంతోషంగా సమ్మతించాడు.

మరునాడు తెల్లవారగానే విదీశ, ఆమె తల్లిదండ్రులు, యశుడితో కలిసి ఉపగుప్తుడు విడిది చేసిన విహారానికి వెళ్ళారు. తల్లిదండ్రులు, యశుడు విహారానికి వెలుపలే ఆగిపోయారు. విదీశ మాత్రం ఉపగుప్తుణ్ణి దర్శించడానికి లోపలికి వెళ్ళింది.

కొంతసేపు తరవాత గంభీరవదనంతో విదీశ, విహారం నుంచి వెలుపలికివచ్చింది. అందరూ ఉత్కంఠతతో ఆమెకేసి చూడసాగారు. ఆమె చిరుదరహాసంతో, "మీకుదగ్గర కావాలనుకుంటూన్న యువరాజు దూరంగా ఎందుకు నిలబడ్డారు?" అన్నది చెట్టు కింద నిలబడ్డ అశోకుణ్ణి చూపుతూ.

యశుడి ముఖం ఆనందంతో వెలిగిపోయింది. అతడు పరుగుపరుగున వెళ్ళి, అశోకుణ్ణి విదీశ తల్లిదండ్రుల వద్దకు తీసుకు వచ్చాడు.

"యువరాజా! గురుదేవుడు తమ కోరికను అంగీకరించమని సెలవిచ్చాడు. అయితే, ఒక విన్నపం! బుద్ధుడు బోధించిన ధర్మమార్గాన్ని నేను అనుసరించడానికి తమరు అంగీకరించాలి!" అన్నది విదీశ ప్రశాంతమైన కంఠస్వరంతో.



"విదీశాదేవి విన్నపాన్ని హృదయ పూర్వకంగా అంగీకరిస్తున్నాను," అన్నాడు అశోకుడు.

"కృతజ్ఞురాలిని! మీతో నా వివాహం జరగడం తథాగతుడికి ప్రీతిపాత్రంకాగలదని గురుదేవుడి విశ్వాసం. నా గురువు పట్ల నాకు అపారమైన నమ్మకం ఉన్నది. ఆయన సలహాను పాటించడానికి సిద్ధంగా ఉన్నాను," అంటూ విదీశ తన తల్లి దండ్రులకూ, అశోకుడికీ, యశుడికీ వంగి నమస్కరించింది.

* * *

వివాహానికి అనుమతిని వేడుతూ, శాక్యనాయకుడూ, అశోకుడూ బిందుసార చక్రవర్తికి ఒక దూతద్వారా లేఖలు పంపారు. కాని ఆ లేఖలు బిందుసారు

డికి అందలేదు. సుశేముడి మిత్రుడొకడు దూతకు డబ్బిచ్చి, ఆ లేఖలను తీసుకుని వాటిని నాశపరిచాడు. సుశేముడి మనుషులు – తాను వివాహానికి పరిపూర్ణంగా సమ్మతిస్తున్నట్టు చక్రవర్తి రాసినట్టే ఒక ఉత్తరం రాసి ఆయనకు తెలియకుండా అశోకుడికి పంపారు!

అశోకుడు అవంతీ ప్రాంతానికి రాజప్రతినిధిగా పదవీ బాధ్యతలు స్వీకరించిన తరవాత విదీశను వివాహమాడాడు.

ఒకనాడు సుశేముడు తండ్రి దగ్గరికి వెళ్ళి, "అశోకుడు శాక్యనాయకుడి కుమార్తెను వివాహమాడాడట! వేగుల ద్వారా తెలిసింది!" అన్నాడు.

"ఏమిటీ! తండ్రికి తెలియకుండా తనయుడి వివాహమా? అదీ రాజకుమారుడు ఒక సాధారణ యువతిని వివాహమాడడమా!" అని రాజు ఎంతో బాధపడ్డాడు. "సాధారణ స్త్రీ కడుపున పుట్టిన వాడి బుద్ధి అలాగే ఉంటుంది. మరో విధంగా ఎలా ఉంటుంది?" అని విరక్తితో అనుకోసాగాడు. దానిని చూసి సుశేముడు ఎంతో సంతోషించాడు.

కొన్నాళ్ళు గడిచాయి. మళ్ళీ తక్షశిలలో తిరుగుబాటు బయలుదేరింది. బిందుసారుడు సుశేముణ్ణి పిలిచి, "ఉజ్జయినిలో వున్న అశోకుణ్ణి పిలిచించి, తక్షశిలకు పంపడం కష్టం. నువ్వు గాని, నీ సోదరులలో ఒకరుగాని వెళ్ళి తక్షశిల తిరుగుబాటును అణచిరండి," అన్నాడు.

సుశేముడికి తన సామర్థ్యం మీద నమ్మకం లేదు. వెళ్ళనంటే తన అసమర్థత బయట పడుతుంది. అందువల్ల, "తండ్రీ! తక్షశిలకు వెళ్ళి తిరుగుబాటును అణచడం నా బాధ్యతగా భావిస్తున్నాను. అయినా, అశోకుడు వెళ్ళి తిరుగుబాటును అణచినప్పుడు శత్రుశేషం లేకుండా నిర్మూలించి ఉన్నట్టయితే, ఇంతత్వరలో తిరుగుబాటు మళ్ళీ తలెత్తి ఉండేది కాదు!" అన్నాడు.

"ఇందులో గ్రీకులహస్తంఉందని భావిస్తున్నాను. నేను అస్వస్థగా ఉన్న విషయం వాళ్ళకు తెలుసు. తమ భారత భూభాగాన్ని మౌర్యులకు వదులుకున్నామన్న సంగతి వాళ్ళింకా మరిచిపోలేకుండా ఉన్నారు. అలజడి సృష్టించడానికి అదేకారణం," అన్నాడు బిందుసారుడు. – (ఇంకావుంది)






# వ్యాఘ్రేశ్వర దర్శనం

పట్టుదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీలాంటి పట్టుదల గలవాళ్ళూ, ఎంతటి కఠోర శ్రమకైనా వెనుదీయనివాళ్ళూ లోకంలో చాలా అరుదుగా వుంటారని నా నమ్మకం. అయితే, అలాంటి వాళ్ళల్లో కొందరు అనాలోచితంగా, తాత్కాలికమైన భావావేశానికి లొంగిపోయి, గతంలో తమను అనాదరంగా, చులకనగా చూసిన వారికి వశులై ఆత్మగౌరవానికి తిలోదకాలిస్తారు. ఇది మహాయోధులూ, శూరులకేకాదు; ఊహాలోకాల్లో విహరించే కవులకైనా కూడని పని. నీకు హెచ్చరికగా వుండేందుకుగానుకళానాథుడనేకవి కథచెబుతాను, శ్రమ తెలియకుండా, విను, అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



ఒకానొకప్పుడు సింహపురి రాజాస్థానంలో వ్యాఘ్రేశ్వరుడనే కవి వుండేవాడు. ఆయన సకల శాస్త్రాలూ అభ్యసించాడు. అష్టాదశ పురాణాల్లో పాండిత్యం సంపాదించాడు. వేదోపనిషత్తుల సారం గ్రహించాడు. అందువల్ల ఆయన చెప్పే కవిత్వం అర్థవంతంగానూ, భావయుక్తంగానూ, రసవత్తరంగానూ వుండేది. రాజాయన ప్రత్యేకతను గుర్తించి, ఆయనకెన్నో అధికారాలనిచ్చాడు.

రాజు వద్ద ఎంతో పలుకుబడివుండడం వల్ల, ఎందరో ఆయనను కలుసుకుని ప్రయోజనాలు పొందాలనుకునే వారు. ఆ కారణంగా సామాన్యులకు వ్యాఘ్రేశ్వర దర్శనం, రాజ దర్శనమంత కష్టంగానూ వుండేది.

ఆ దేశంలోనే వాడపల్లి అనే గ్రామంలో కళానాథుడనే యువకుడుండేవాడు. వాడికి సాహిత్యాభిలాష ఎక్కువ. చిన్నప్పటి నుంచీ ప్రముఖుల కావ్యాలు చదివే వాడు. అవి చదువుతున్నప్పుడు కవితావేశం కలిగితే ఆశువుగా పెద్దలకు వినిపించేవాడు. ఒకసారి ఆ గ్రామానికి వచ్చిన మహాకవి ఒకరు, కళానాథుడి కవిత్వం విని, "నాయనా! నీవు కారణజన్ముడివి. సహజ కవివి. బాగా సాధన చేయి. విశ్వ విఖ్యాతి చెందుతావు," అని దీవించి వెళ్ళాడు.

అప్పటి నుంచీ కళానాథుడు కవిత్వం పై మరింత శ్రద్ధవహించాడు. ఆరంభంలో ఆశువుగా పద్యాలు చెప్పడం ప్రారంభించినవాడు, ఇరవై ఏళ్ళ వయస్సు వచ్చేసరికి మూడు కావ్యాలు కూడా రచించాడు. విన్న వారందరూ ఆ కావ్యాలను చదివి బాగా మెచ్చుకునేవారు. కొందరైతే, "నీవు సరస్వతీ పుత్రుడవనిపిస్తుంది. ఒకసారి వెళ్ళి వ్యాఘ్రేశ్వరుణ్ణి కలుసుకుని, నీ కవిత్వం వినిపించు. నీకు సరైన గుర్తింపు లభిస్తుంది," అని సలహా ఇచ్చారు.

కళానాథుడు తన కావ్యాలను తీసుకుని సింహపురి వెళ్ళాడు. వ్యాఘ్రేశ్వరుడి దర్శనం కోసం, ఆయన ఇంటికి వెళ్ళగా కాపలావాడు, "నీ పనేమిటో చెప్పు. వారికి విన్నవిస్తాను. ఆపైన నీ అదృష్టం," అన్నాడు.

కళానాథుడు కొన్ని పత్రాలపైన తన కావ్యాల్లోంచి కొన్ని పద్యాలు ఎన్నుకుని రాసి కాపలా వాడికిచ్చి, "వీటిపై కవిగారి అభిప్రాయం కావాలి," అన్నాడు.

కాపాలావాడు పత్రాలు తీసుకుని కళా నాథుడివంక ఆశ్చర్యంగా చూసి, "ఇంతేనా, ఇంకేమీ అవసరం లేదా? కవిగారిది మా మంచి మనసు. నీకే సాయం కావాలన్నా చేస్తాడు," అన్నాడు.

కళానాథుడు తనకే సాయమూ అవసరం లేదన్నాడు.

కాపలావాడు లోపలకు వెళ్ళి వ్యాఘ్రేశ్వరుడికి, కళానాథుడి గురించి చెప్పాడు. అప్పటికాయన చుట్టూ చాలా మంది వున్నారు. అందువల్ల ఆయన కాపలా వాడు తెచ్చిన తాళపత్రాలను, తన శిష్యుడి చేతికిచ్చి, "ఇవి చదివి నీ అభిప్రాయం రాయి. నేను సంతకం పెడతాను," అన్నాడు.

శిష్యుడు పద్యాలను శ్రద్ధగా చదివి, "గురవర్యా! ఇందులోని పద్యాలు అసాధారణంగా ఉన్నాయి. ఆ కవినొకసారి లోపలికి రమ్మనేదా?" అని అడిగాడు.

"నాయనా! ఇప్పటికే లోపల ఎందరో వున్నారు. ఆ కవి కేవలం అభిప్రాయాన్ని మాత్రమే కోరాడు. అడిగినదిచ్చి పంపడం ఉత్తమం," అన్నాడు వ్యాఘ్రేశ్వరుడు.

శిష్యుడు తన అభిప్రాయాన్ని ఒక తాళపత్రంపై రాయగానే, వ్యాఘ్రేశ్వరుడు సంతకం పెట్టి కాపలా వాడికందజేశాడు. వాడా తాళపత్రాలను కళానాథుడికిచ్చాడు. తనకు పిలుపు రాలేదని నిరుత్సాహపడి తిరిగివెళ్ళాడు, కళానాథుడు.

అలా కొంతకాలం గడిచింది. రాజు పనుపున వ్యాఘ్రేశ్వరుడు దేశసంచారం ప్రారంభించి, ఒక రోజున వాడపల్లి చేరు



కున్నాడు. ఆయన రాక సామాన్యంగా లేదు. ప్రయాణమే ఒక పెద్ద ఏనుగుమీద. ఆయన చుట్టూ పెద్ద పటాలం. మహావైభవంగా వచ్చిన వ్యాఘ్రేశ్వరుడికి అంత వైభవంగానూ విడిది ఏర్పాటు చేశాడు గ్రామాధికారి.

వ్యాఘ్రేశ్వరుడా ఊళ్ళో రెండు రోజులున్నాడు. మొదటిరోజున ఊరి వారందరూ ఒకరొక్కరుగా వచ్చి, ఆయనకు తమ సమస్యలు చెప్పుకున్నారు.

గ్రామాధికారి, వ్యాఘ్రేశ్వరుడితో, "అయ్యా! మా ప్రజల సమస్యలు ప్రత్యక్షంగావిని తెలుసుకున్నారు గదా! ఇవన్నీ పరిష్కరించడానికి తగిన ఆర్థిక సహాయం మాకులభించేలా తమరు చేయాలి,"అని విన్నవించుకున్నాడు.



"రాజుగారికి నా మాటంటే గౌరవం. తప్పక నా ప్రయత్నం నేను చేస్తాను. రేపు గ్రామ సందర్శనానికి కూడా ఏర్పాట్లు చెయ్యండి," అన్నాడు వ్యాఘ్రేశ్వరుడు.

మర్నాడు వ్యాఘ్రేశ్వరుడు గ్రామాన్ని చూడడానికి బయలుదేరాడు. గ్రామస్థులు ఆయన దర్శనం కోసం గుంపులు గుంపులుగా వచ్చారు. వాళ్ళను అదుపుచేయడం చాలా కష్టమైంది. మొత్తం మీద వ్యాఘ్రేశ్వరుడు మధ్యాహ్నానికల్లా గ్రామమంతా తిరగడం పూర్తయింది. అయినా ఆయన దర్శనం మాత్రం గ్రామంలో అందరికీ లభించలేదు.

మధ్యాహ్న భోజనానంతరం విశ్రమించే ముందు వ్యాఘ్రేశ్వరుడు, గ్రామాధికారితో, "గ్రామంలో కవులెవరైనా వుంటే చెప్పండి. వారికి నా చేతనైన సాయం చేస్తాను," అన్నాడు.

"అయ్యా! మా గ్రామంలో ఇద్దరు ముగ్గురు కవులున్నారు. వందమంది దాకా సాహిత్యంతో పరిచయమున్నవారున్నారు. అందరూ మిమ్మల్ని కలుసుకుని మాట్లాడాలని కుతూహల పడుతున్నారు. గోష్ఠి ఏర్పాటు చేసేదా?" అన్నాడు గ్రామాధికారి ఉత్సాహంగా.

"గోష్ఠి అంటే ఏ వందమందికో పరిమితం. చాలామంది నన్ను చూడాలనుకుంటారు కదా! అందరికీ ఒక సభ ఏర్పాటు చేయండి. నేను ప్రసంగిస్తాను. సమస్యలున్నవారు పత్రాలపై తమ సమస్యల్నీ, చిరునామానూ రాసి నాకు అందజేస్తే, పరిశీలించ గలను," అన్నాడు వ్యాఘ్రేశ్వరుడు.

ఈ విషయమై దండోరావేయబడింది. సభకు జనంతండోపతండాలుగా వచ్చారు. వ్యాఘ్రేశ్వరుడు బహుజన రంజకంగా ఉపన్యసించాడు. సభికులు కరతాళ ధ్వనులుచేసి తమసంతోషం వ్యక్తపరిచారు.

సభముగిశాక ఇద్దరు కవులు, కొందరు సాహితీ అభిమానులు వ్యాఘ్రేశ్వరుణ్ణి ప్రత్యేకంగా కలుసుకున్నారు. ఆయన వారి సౌకర్యార్థం గ్రామంలో గ్రంథాలయం ఏర్పాటు చేయగలనని మాట ఇచ్చాడు.

అప్పుడు గ్రామాధికారి గుర్తించాడు- ఆ వచ్చిన వారిలో కళానాథుడు లేడని! అంతవరకూ వ్యాఘ్రేశ్వరుణ్ణి ప్రత్యేకంగా కలుసుకునే ప్రయత్నమేదీ చేయలేదని కూడా తెలుసుకున్నాడు. ఆయనకు కళా

నాథుడన్నా, అతడి కవిత్వమన్నా ఎంతో ఇష్టం. ఒక్కసారి వాళ్ళిద్దర్నీ కలిపితే బాగుంటుదన్న ఉద్దేశంతో ఆయన తన మనిషితో, కళానాథుడింటికి కబురంపాడు. అయితే, తనకు తీరుబడిలేదని కళానాథుడు వెళ్ళ లేదు.

కొంతకాలం గడిచింది. వ్యాఘ్రేశ్వరుడి మనసులో ఏదో అసంతృప్తి బయల్దేరింది. ఇహలోక వైభవాలేవీ ఆయనకు సంతోషాన్నివ్వడంలేదు. చివరికాయన ఆస్థానపదవి విడిచి పెట్టాడు. పిల్లలకు ఆస్తి పంచి పెట్టాడు. సమీపారణ్యంలో ఆశ్రమం నిర్మించుకుని వానప్రస్థం స్వీకరించాడు. భార్య ఆయన్ననుసరించి పోయి ఆశ్రమంలో వుంటున్నది.

ఈ విషయం కళానాథుడికి తెలిసింది. అతడు తన కావ్యాలు తీసుకుని వ్యాఘ్రేశ్వరుణ్ణి చూడ బోయాడు. అరణ్య ప్రయాణం ఏమాత్రం సుగమంగా లేదు. ఏమైతేనేం – అష్టకష్టాలకూ ఓర్చి అతడు, వ్యాఘ్రేశ్వరుడి దర్శనం చేసుకోగలిగాడు.

అప్పుడు ఆశ్రమంలో వ్యాఘ్రేశ్వరుడు, ఆయన భార్య మాత్రమే వున్నారు. వారికి సపర్యలు చేయడానికి ఒక పరిచారకుడు, పరిచారిక ఉన్నారట. వాళ్ళు సమీపంలోని కొలనుకు వెళ్ళారు.

కళానాథుడు ఆశ్రమంలో అడుగుపెట్టే సమయంలో, వ్యాఘ్రేశ్వరుడు, భార్యకు భాగవత పురాణం వినిపిస్తున్నాడు. ఆమె భక్తి పారవశ్యంతో కళ్ళుమూసుకుని, తల ఊపుతూ, "ఈ పురాణం తమనోటవినడం, నేనీజన్మకు చేసుకున్న అదృష్టం!" అన్నది.

"నానోటనే కాదు– ఏనోటనైనా ఇది చాలా గొప్ప పురాణం. ఇలాంటి కావ్య రచన చేయగలిగిననాడే, నేనూ నిజమైన కవిని," అన్నాడు వ్యాఘ్రేశ్వరుడు.





"తమరి మాట కాదనగలిగినంత వాణ్ణి కాదు గానీ, తమరిప్పటికే మహాకవుల రచనలకు సరితూగ గల కావ్యాలు కొన్ని రాసివున్నారని నా అభిప్రాయం," అన్నాడు కళానాథుడు చటుక్కున.

అప్పుడు వ్యాఘ్రేశ్వరుడు, కళానాథుణ్ణి చూసి, అతడి వివరాలడిగి తెలుసుకుని, "నీవురాసిన కావ్యంలో పద్యాలేమైనా చదివి వినిపించు," అన్నాడు.

కళానాథుడు పద్యాలు చదువుతూంటే, ఆయన శ్రద్ధగా విని, "నాయనా! నీవు నిజంగా సరస్వతీ పుత్రుడవే. కానీ నీ పద్యాల్లో అక్కడక్కడా వ్యాకరణ దోషాలు న్నాయి. వాటిని సవరించడం సులభమే కానీ, అవి సవరించకపోతే నీ కవిత్వం వెలవెలబోక తప్పదు," అన్నాడు.

"అయ్యా! ఈ పద్యాలు తమరిదివ రలో చదివివున్నారు. అప్పుడు వ్యాకరణ దోషాల గురించి తమరు ప్రస్తావించలేదు," అన్నాడు కళానాథుడు.

ఆ తర్వాత అతడి ద్వారా జరిగింది విన్నాక వ్యాఘ్రేశ్వరుడు, "నాయనా! అవి అనాడు నాశిష్యుడు చదివాడు. నేనుచదవ లేదు. ఆరోజు నీవు అభిప్రాయం కాక దర్శనం అడిగితే ఎంతో బాగుండి వుండేది. మనం ముఖాముఖీ ఎన్నో మాట్లాడుకుని వుండేవాళ్ళం," అన్నాడు.

దీనికి కళానాథుడు నవ్వి, "నా పద్యం నా పరిచయం. అది చదివి తమరుతప్పక దర్శనమిస్తారని ఆశించాను. ఆనాడు నా పద్యాలపై బాగున్నవన్న అభిప్రాయంకంటే, ఈనాడు మీరు వ్యాకరణ దోషాలున్నవని చెప్పిన అభిప్రాయమే, నన్నెంతో సంతోష పెట్టింది. నన్ను కొంత కాలం పాటు మీ శుశ్రూష చేసుకోనివ్వండి. అదే నా కోరిక!" అన్నాడు.

బేతాళుడు ఈకథచెప్పి, "రాజా, చాలా మంది కవిపండితుల చేత గొప్ప కవిగా ప్రశంసింపబడిన కళానాథుడి ప్రవర్తన వింతగానూ, అసమంజసంగానూ, ఆత్మ గౌరవానికి తిలోదకాలిచ్చినట్టుగానూ లేదా? వ్యాఘ్రేశ్వరుడు తన పర్యటనలో, తన స్వగ్రామం వచ్చిన నాడు గ్రామాధికారి కబురు పంపినా, అతడు ఆయనను చూడ నిరాకరించాడు. అలాంటివాడు, అరణ్యంలో వానప్రస్థుడుగా జీవిస్తున్న వ్యాఘ్రేశ్వరుడి దగ్గరకు, కంటక ప్రాయ మైన అరణ్యమార్గ శ్రమలకోర్చి వెళ్ళడాన్ని

ఏమనాలి? అంతేకాక, వ్యాఘ్రేశ్వరుణ్ణి తను కొంతకాలంపాటు శుశ్రూష చేసేందుకు అనుమతి కూడా కోరాడు. ఇదంతా చూస్తూంటే, కళానాథుడు అంతోయింతో చిత్త భ్రమకు్కాడా లోనైనట్టు కనిపించడం లేదా? ఈసందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కళానాథుడు సింహపురిలో వ్యాఘ్రేశ్వరుణ్ణి చూడబోయినప్పుడు, తన కవిత్వం చదివి తప్పక దర్శనమిస్తాడని ఆశించాడు. కానీ దర్శనమివ్వకుండా తన అభిప్రాయం మాత్రం తెలియబరిచాడు వ్యాఘ్రేశ్వరుడు. ఆయనకు కవిత్వంపై దృష్టి తగ్గిందనీ, తన పలుకుబడితో సామాన్యులకు సాయపడుతున్నాడనీ కళానాథుడు భావించాడు. కవిత్వ విషయంలో తప్ప అతడికి వ్యాఘ్రేశ్వరుడితో ఇతరత్రా పనులేంలేవు. అందుకనే వ్యాఘ్రేశ్వరుడు తన గ్రామం వచ్చినా, కళానాథుడు అతడి దర్శనం చేసుకోలేదు. అతడిక్కావలసింది ఆయనతో సాహిత్య చర్చ; కేవలం దర్శనంకాదు. కానీ ఎప్పుడైతే వ్యాఘ్రేశ్వరుడు రాజు కొలువు మాని అరణ్యంలో ఆశ్రమ జీవితం గడుపుతున్నాడని తెలిసిందో – ఆక్షణంలోనే కళానాథుడు, ఆయన దర్శనం వల్ల మేలు కలుగుతుందని గ్రహించాడు. ఆ కారణంవల్లనే ఎన్నో శ్రమలకోర్చి అతడు, ఆయన ఆశ్రమానికి వెళ్ళాడు. మాటల సందర్భంలో వ్యాఘ్రేశ్వరుడు, తను సింహపురిలో వుండగా కళానాథుడి కవిత్వం గురించి చెప్పిన అభిప్రాయం తనది కాదనీ, తన శిష్యుడి దనీ చెప్పడమేగాక – అందులో కొన్ని వ్యాకరణ దోషాలున్నవని కూడా హెచ్చరించాడు. దానితో కళానాథుడికి కవిగా వ్యాఘ్రేశ్వరుడెంత ఉన్నతుడో అర్థమైంది. అందువల్లనే అతడు, ఆయనను శుశ్రూష చేసుకోనివ్వమనికోరాడు. ఈకారణాలవల్ల, కళానాథుడు ఆత్మగౌరవానికి తిలోదకాలిచ్చాడని గానీ, లేక చిత్తభ్రమకు లోనయ్యాడనిగానీ అనుకోవడం పొరబాటవుతుంది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.–(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]



# సోమసేనుడి చిత్రం

హేలాపురిలో ప్రతి సంవత్సరం చిత్రలేఖన ప్రదర్శన జరుగుతూంటుంది. ఆ చిత్రప్రదర్శన శాలలో, ప్రసిద్ధిపొందిన చిత్రకారుల చిత్రాలతోపాటు, అంతగా పేరులేని చిత్రకారుల చిత్రపటాలు కూడా ప్రదర్శించబడతాయి.

ప్రతి సంవత్సరంలాగే, ఆ సంవత్సరంకూడా హేలాపురిలో చిత్రప్రదర్శన జరుగుతున్నది. దేశంలోని అనేక ప్రాంతాలనుంచివచ్చిన ప్రసిద్ధచిత్రకారుల చిత్రపటాలేకాక, అప్పుడప్పుడే చిత్రలేఖనం అభ్యసిస్తున్న చిత్రకారుల చిత్రాలతో ప్రదర్శనశాల కళకళలాడుతున్నది.

సుగంధపురినుంచి వచ్చిన సోమసేనుడనే చిత్రకారుడు, తను వేసిన చిత్రాన్ని ప్రదర్శనకు తీసుకు వచ్చాడు. అతడి చిత్రం కూడా ప్రదర్శనశాలలో ప్రదర్శించబడుతున్నది.

ఒకనాడు సోమసేనుడు బస చేసిన సత్రానికి విలాసుడనే శివగిరి నగరవాసి వచ్చాడు. మాటల సందర్భంలో సోమసేనుడు ఫలానా అని తెలుసుకుని, "ఇవ్వాళ చిత్ర ప్రదర్శనశాలకు వెళ్ళాను. అక్కడ మీరు వేసిన చిత్రం దగ్గర ఒక గంటపాటు నిలబడిపోయాను," అన్నాడు.

దానికి సోమసేనుడు చాలా సంతోషించి, "నా చిత్రం మీకు అంతగా నచ్చినందుకు కృతజ్ఞుణ్ణి! అంత బావున్నదా, నేనువేసిన చిత్రం?" అని ప్రశ్నించాడు.

"అదేమోగానీ – మిగతా చిత్రాలు చూద్దామంటే, ప్రతి చిత్రం దగ్గరా జనం క్రిక్కిరిసిపోయి వున్నారు. అందువల్ల ఒక నిండు గంటకాలం నేనొక్కడినే మీ చిత్రం ముందువుండిపోవలసి వచ్చింది," అన్నాడు విలాసుడు.

ఇది విని సోమసేనుడు నీరసపడిపోయాడు.

– కోనే నాగవెంకటఆంజనేయులు



సముద్రతీర ప్రయాణాలు - 22

# ఒరిస్సా తీరం

రచన: మీరా నాయర్ ▼ చిత్రకారుడు : కె.ఎస్. గోపకుమార్




తీరం నుంచి కొన్ని కి.మీ. లోపలికి అంటే, భూభాగంలోకి వెళ్ళామంటే చేనేత చీరలకు ప్రసిద్ధిగాంచిన బోమొకోయ్ అనే చిన్న గ్రామం చేరుకుంటాం. చేనేత, ఒరిస్సాలో తరతరాల సంప్రదాయంగా వస్తూన్న కుటీర పరిశ్రమ. రాష్ట్ర వ్యాప్తంగా, చేనేతను జీవనోపాధికి వృత్తిగా చేపట్టిన ప్రజలు చాలామంది ఉన్నారు. బోమొకోయ్‌లో నేసే చీరలకు ఒక ప్రత్యేకత ఉంది. అదేమంటే, ఏ రెండు చీరలూ ఒకేవిధంగా ఉండవు. అంటే ఒక చీరనుపోలినట్టు మరొక చీరఉండదు. రెండింటికీ కొద్దిగా అయినా తేడాఉంటుంది.

ఇక్కడికి మరి కొంతదూరం ఉత్తరంగా మనదేశంలోని అతిపెద్ద సరస్సుగా పేరు గాంచిన చిల్కా సరస్సు ఉన్నది. ఈ సరస్సును బంగాళాఖాతంలోకి కలుపుతూ సన్నటి నీటిపాయ ఉన్నది. ఈ సరస్సు దాదాపు 1,100 చ.కి.మీ. విస్తరించి ఉన్నది. వేసవికాలంలో సరస్సులోని నీళ్ళు ఉప్పగా ఉంటాయి. వర్షాకాలంలో దయా, భార్గవీ నదులు ఈ సరస్సులోకి ప్రవహించడంతో, ఉప్పునీళ్ళు సముద్రంలోకి కొట్టుకుపోతాయి. సరస్సు మంచినీళ్ళతో నిండుతుంది. అందుకే చిల్కా సరస్సు మనదేశంలోని అతిపెద్దమంచినీళ్ళ సరస్సు అనే ప్రత్యేకతను సంతరించుకున్నది.

ఈ సరస్సులో అక్కడక్కడ చిన్న చిన్న పగడాల దీవులు ఉన్నాయి. ఒక దీవిలో ఈ సరస్సు అధిదేవత కాళీజయ్ గుడి ఉన్నది. దీవులలో నీటి పక్షులు చాలా ఉన్నాయి. శీతాకాలంలో బాతులు, ఓదె కొంగలు, గూడకొంగలు, బూడిదరంగు నారాయణపక్షులు తిరగడం కనుల విందు చేస్తాయి.

చిల్కా సరస్సులో చేపలు పట్టే పడవలకు, చాపలతో తయారుచేసిన చతురస్రాకారపు తెరచాపలను ఉపయోగిస్తారు.


చిల్కాసరస్సు

మరికొంతదూరం ఉత్తరంగా పయనించామంటే ప్రాచీన కాలంలో పాలౌరా రేవుపట్టణంగా ప్రసిద్ధిగాంచిన ఈనాటి పూరీ చేరుకుంటాం.

పాలౌరా ఒకప్పుడు ఇండోనేషియా దీవులతో వర్తక వ్యాపారాలు సాగించిన సుప్రసిద్ధ రేవుపట్టణం. ఈనాడు పూరీ రాష్ట్రంలోకెల్లా చాలా పొడవైన సముద్ర తీరం గల రేవుపట్టణంగా ఉంటున్నది. హిందువులు పరమ పవిత్రంగా భావించే మనదేశంలోని నాలుగు పుణ్యక్షేత్రాలలో పూరీ ఒకటి. (బదరీ కేదారనాథ్, రామేశ్వరం, ద్వారక మిగిలిన మూడు పుణ్యక్షేత్రాలు.)

పూరీ పట్టణం నడిబొడ్డున ఎత్తయిన ప్రదేశంలో గంభీరమైన జగన్నాథ మందిరం వెలుగొందుతున్నది. 12వ శతాబ్దంలో చోడ గంగరాజు, తన రాజధానిని దక్షిణ ఒరిస్సా నుంచి మధ్య ఒరిస్సాకు మార్చిన సందర్భాన్ని పురస్కరించుకుని ఈ ఆలయాన్ని నిర్మించాడు. చెల్లెలు సుభద్ర, అన్న బలభద్రుడు సమేతంగా శ్రీకృష్ణ రూపంలో జగన్నాథస్వామి ఈ ఆలయంలో పూజింపబడుతున్నాడు. గర్భ గృహంలో కొయ్యతో తయారుచేయబడిన విగ్రహాలు అసంపూర్ణంగా కనిపిస్తాయి.

ఒకప్పుడు ఈ ఆలయంలోని ఇంద్రనీలంతో తయారుచేసిన విష్ణువిగ్రహాన్ని తన వశం చేసుకోవడానికి రాజు ఇంద్రద్యుమ్నుడు ఆశించాడు. ఆయన రహస్యంగా ఆలయంలో ప్రవేశించినప్పుడు గర్భగృహంలోని విగ్రహం మాయమైపోయింది. తాను చేసిన హీనకృత్యానికి రాజు ఎంతో పశ్చాత్తాప పడ్డాడు. ప్రాయశ్చిత్తంగా కఠోరమైన తపస్సుకు పూనుకున్నాడు. ఒకనాడు ఆయన ధ్యానంలో ఉండగా దైవ విగ్రహం దుంగరూపంలో కనిపించకలదని అశరీరవాక్కు వినిపించింది. రాజు సముద్రం కేసి నడిచాడు. సముద్ర జలాలపై ఒక దుంగ తేలుతూ రావడం కనిపించింది. దానిని సైనికులు తీరానికి లాగారు. ఆ దుంగలో విష్ణురూపాన్ని మలచమని రాజు శిల్పులను ఆదేశించాడు. అయినా ఒక్క శిల్పకారుడు కూడా ఆ పనిలో కృతకృత్యుడు కాలేక పోయాడు. విగ్రహం చెక్కబోతే ఉలి విరిగేది; లేదా చేతికి గాయం తగిలేది.

ఆఖరికి దేవుడే ఒక వృద్ధశిల్పి రూపంలో రాజు దగ్గరికి వచ్చి, తనకు ఇరవై ఒక్క రోజులు గడువిస్తే విగ్రహం చెక్కగలననీ, తాను విగ్రహం చెక్కుతూండగా ఎవరూ చూడరాదనీ నియమం పెట్టాడు. రాజు అందుకు అంగీకరించి, వృద్ధశిల్పికి ఏకాంత భవనం ఏర్పాటు చేసి ఇచ్చాడు. కొన్నిరోజులు గడిచాయి.

రథయాత్ర



రాజుకు దైవ విగ్రహం ఎలా వుందో చూడాలన్న ఉత్సాహం కలిగింది. మూసిన తలుపుల మధ్యనున్న ద్వారం గుండా వృద్ధశిల్పి ఏం చెక్కుతున్నాడా అని చూశాడు. అంతే వృద్ధశిల్పి మాయమై పోయాడు. ఆ తరవాత కనిపించలేదు. రాజు ఆయన అసంపూర్ణంగా చెక్కిన మూడు విగ్రహాలను తెచ్చి ఆలయంలో ప్రతిష్ఠించాడు.

పన్నెండు సంవత్సరాలకు ఒకసారి ఆలయంలోని విగ్రహాలను మారుస్తూ ఉంటారు.

ఈనాటికీ విగ్రహాలు తయారు చేయడానికి తగిన దుంగను సేకరించడం చాలాముఖ్యమైన పనిగా భావిస్తారు. పూజారు(దైతా)ల కలలో కనిపించిన వేపచెట్టు బోదెల నుంచి దుంగలు తీసుకొచ్చి, వాటి నుంచే విగ్రహాలు తయారుచేస్తారు.

విగ్రహాలు తయారు చేయడం పూర్తయిన తరవాత, ఆలయ పూజారి కళ్ళకు గంతలు కట్టుకుని -- పాత విగ్రహాలలో దాచిన ఏదో వస్తువును (బుద్ధుడి పవిత్ర దంతం అని పలువురు పండితుల అభిప్రాయం) తీసి కొత్త విగ్రహాలలోకి మారుస్తాడు. ఆ వస్తువు ఏదో పూజారితో సహా ఎవరికీ తెలియకుండా, పూజారి చేతులమీద బట్టను కప్పుతారు. ఇది యేటా జూలై నెలలో జరిగే రథయాత్రకు ముందు **'నవ్ కలేబర'** ఉత్సవ సమయంలో జరుగుతోంది.

శ్రీకృష్ణుడు గోకులం నుంచి మధురకు ప్రయాణమైన సంఘటన గుర్తుగా సుప్రసిద్ధ రథయాత్రను జరుపుతారు. మూడు విగ్రహాలను బ్రహ్మాండమైన కొయ్య రథాలలో ఉంచి జగన్నాథ ఉద్యాన భవనాని (గుండిచబారి)కి ఊరేగింపుగా తీసుకు వెళతారు. పదహారు చక్రాలతో 14 మీ॥ ఎత్తూ, 11మీ వెడల్పు గల **నందిఘోష** అనే రథం మూడింటిలో పెద్దరథం.

రథాలు ప్రయాణం చేయవలసిన దూరం దాదాపు ఒక మైలు ఉంటుంది. అయినా ఊరేగింపు 'గుండిచబారి' చేరడానికి ఒక రోజంతా పడుతుంది. రథోత్సవాన్ని తిలకించడానికీ, రథాన్ని లాగడానికీ వేలాదిమంది భక్తులు వస్తారు. పవిత్రమైన ఆ రోజు జగన్నాథ విగ్రహాన్ని స్పృశిస్తే ఆపైన జనన మరణాలు ఉండవని పలువురి విశ్వాసం. అందువల్ల విగ్రహాన్ని స్పృశించడానికి భక్తులు అమిత ఆసక్తిని కనబరుస్తారు.

ఎనిమిది రోజులు తరవాత, విగ్రహాలను మళ్ళీ ప్రధాన దేవాలయానికి మునుపటిలాగే



కోలాహలంగాతీసుకువస్తారు.

ఈ రాష్ట్రానికి చెందిన ఒడిస్సీ లేదా ఒరిస్సీ నాట్యమనే శాస్త్రీయనాట్య కళాభివృద్ధికీ, ఈ ఆలయంలోని అగమవిధులకూ చాలా సంబంధం ఉన్నది. పాదాల చుట్టూ తామర పువ్వులా విచ్చుకునే కుచ్చుల చీరకట్టుకుని, తెల్లటి ఆభరణాలు, తెల్లటి పువ్వులు ధరించి, నాట్యం చేస్తే ఒడిస్సీ కళాకారులు పూరీ జగన్నాథ ఆలయంలో మూడు విగ్రహాలకు ప్రార్థనా పూర్వకంగా నమస్కరించి, ఆ తరవాతే నాట్య ప్రదర్శన ప్రారంభిస్తారు. ఒడిస్సీ నాట్యంలో భక్తిగీతాలే ఆలపిస్తారు. జయదేవుడి గీతగోవిందంలోని అష్టపదులు కూడా రాధాకృష్ణుల అవ్యాజప్రేమను అభివర్ణించేవే!

పూరీకి 16కి.మీ. దూరంలో సంప్రదాయ కళాకారులు నివసించే రఘురాజ్‌పూర్ అనే గ్రామం ఉన్నది. ఇక్కడ బట్టలమీద చిత్రాలు (పత చిత్రాస్) చిత్రిస్తారు.

ఇక్కడికి మరొక పది కి.మీ. దూరంలో అందమైన శ్రీ కృష్ణమందిరం ఉన్నది. ఈ దేవాలయంలో మనిషి ఎత్తు బాలకృష్ణుడి విగ్రహం చాలా ఆకర్షణీయంగా ఉన్నది. ఇద్దరు బ్రాహ్మణుల మధ్య తలెత్తిన వివాదాన్ని పరిష్కరించడానికి బాలకృష్ణుడు ఇక్కడికి సాక్ష్యం చెప్పడానికి వచ్చాడని స్థలపురాణం పేర్కొంటున్నది. అందుకే ఈ దేవాలయానికి **సాక్షిగోపాల మందిరం** అనే పేరు వచ్చింది.

ఒడిస్సీ నాట్యకళాకారిణి





# పాముమంత్రం

తిమ్మాపురం అనే గ్రామంలో, పుల్లయ్య అనే చిన్న రైతు వుండేవాడు. అతడు వున్న కొద్ది పొలాన్ని సాగుచేసుకుంటూ తృప్తిగా కాలం గడుపుతూండేవాడు. అతడికి ఎన్నో ఏళ్ళుగా పాముమంత్రం నేర్చుకోవాలనే కోరిక వున్నది. ఎందరినో అడిగాడు గాని, ఎవరూ పాముమంత్రం నేర్పే వాళ్ళు దొరకలేదు.

ఒకసారి పుల్లయ్య పొరుగూరు బంధువు ఇంటికి వెళ్ళినప్పుడు, ఆయన బంధువును, "నాకు పాముమంత్రం నేర్చుకోవాలని ఉన్నది. మీ ఊళ్ళో పాముమంత్రం నేర్పేవాళ్ళెవరైనా వున్నారా?" అని అడిగాడు.

"మా ఊళ్ళోనే కాదు, చుట్టుపక్కల ఊళ్ళల్లోనూ పాముమంత్రం తెలిసినవాళ్ళెవరూ వున్నారనుకోను! అలాంటి మంత్రం బైరాగులూ, సన్యాసులూ మాత్రమే నేర్చి వుంటారు," అన్నాడు బంధువు.

ఆనాటి నుంచీ పుల్లయ్య, ఏ బైరాగో సన్యాసో కనబడితే అతడి దగ్గర పాము మంత్రం నేర్చుకోవాలని ఎదురు చూస్తున్నాడు.

ఇలా వుండగా – పుల్లయ్య ఒక ఏడు తన పొలంలో జొన్న పంట వేశాడు. జొన్న చేను బాగా ఏపుగా పెరిగి కంకులతో నేత్రానందంగా వున్నది. పంటను పగలు పక్షులనుంచీ, రాత్రిళ్ళు జంతువుల నుంచీ కాపాడేందుకు పుల్లయ్య పొలంలో మంచె కట్టుకుని, రాత్రింబవళ్ళు కాపలా కాయసాగాడు.

ఒకనాడు కనుచీకటి పడే సమయంలో, బైరాగుల తండా ఒకటి తన పొలంవైపుగా రావడం చూశాడు, పుల్లయ్య. ఎంతో కాలంగా వున్న తన కోరిక నెరవేరే సమయం వచ్చిందనుకుంటూ పుల్లయ్య, పట్టరాని ఆనందంతో ఆ బైరాగులకు

డా॥ సుబ్బలక్ష్మి మర్ల



ఎదురు వెళ్ళి, వాళ్ళల్లో ఒడ్డూ పొడుగూ, నల్లటి బారెడు గడ్డం వున్న బైరాగికివంగి నమస్కరించి, తనకు పాముమంత్రం నేర్ప వలసిందిగా కోరాడు.

బైరాగి, పుల్లయ్యకేసి ఒకసారి పరీక్షగా చూసి, "పాముమంత్రం సూర్యోదయ సమయంలో, లేక మిట్టమధ్యాహ్నం వేళా నేర్చుకుంటేనే ఫలిస్తుంది. ఇప్పుడు చీకటి పడబోతున్నది. ఇది తగిన సమయం కాదు. ఈ రాత్రికి నీ చేలో మమ్మల్ని వుండనిస్తే, రేపు ఉదయాన్నే మంత్రం నేర్పుతాను," అన్నాడు.

పుల్లయ్య సంతోషంగా అందుకు ఒప్పుకుని, బైరాగులందర్నీ తన చేనులోకి ఆహ్వానించాడు. వాళ్ళు ఏవో తత్వాలు పాడుకుంటూ జొన్నకంకులు విరిచి, తిన్నన్ని తిని, చేనంతా చిందరవందర చేసి హాయిగా నిద్రపోయారు. పుల్లయ్య తన పంటచేనుకు కలిగిన నష్టానికి ఏమాత్రం విచారించలేదు. పైగాపాముమంత్రం నేర్చుకోబోతున్నాననే సంతోషంతో రాత్రంతానిద్ర పోకుండానే హాయిగా గడిపేశాడు.

తెల్లవారుతూనే బైరాగులందరూ నిద్ర లేచి, బిలబిలమంటూ ప్రయాణం ప్రారంభించారు.

అది చూసి పుల్లయ్య పరుగు పరుగున పోయి, నల్ల గడ్డం బైరాగి పాదాలపైబడి "స్వామీ! పాముమంత్రం! పాముమంత్రం!" అన్నాడు బిగ్గరగా.

బైరాగి కోపంగా, "జోగివచ్చే, జొన్నలు తినే ఉరోజావ్" అంటూ పుల్లయ్య భుజం మీద గట్టిగా కొట్టి. వెళ్ళిపోయాడు, పుల్లయ్య అదే పాముమంత్రం అనుకుని, ఇన్నాళ్ళకు తన కోరిక నెరవేరిందన్న ఉత్సాహంతో, బైరాగి అన్నమాటలను మననం చేసుకుంటూ ఇంటికి పోయి, భార్యకు ఒక బైరాగి తనకు పాముమంత్రం నేర్పాడని చెప్పాడు. ఈ సంగతి పుల్లయ్య భార్య ద్వారా విన్న వాళ్ళు గ్రామమంతా ప్రచారం చేశారు.

ఇది జరిగిన నెలరోజులకు గ్రామంలో ఒకణ్ణి పాముకరిచింది. ఏమి చేయడమా అని వాడి బంధువులు కంగారు పడుతున్నంతలో, సమయానికి పుల్లయ్య పాము మంత్రం గుర్తొచ్చిన వాడొకడు, "భయపడకండి! మన పుల్లయ్యకు పాముమంత్రం వచ్చుగదా! అతడి దగ్గరకుతీసుకుపోదాం," అన్నాడు.

పాము కరిచిన వాణ్ణి పుల్లయ్య దగ్గరకు తీసుకు వచ్చారు. పుల్లయ్య మంత్రాన్ని మనసులోనే కొంతసేపు మననం చేసుకుని, తర్వాత పాముకరిచిన వాడి భుజం మీద గట్టిగా కొట్టాడు. వాడు ఠక్కున లేచి కూర్చున్నాడు. దానితో పుల్లయ్యతో పాటు అక్కడ వున్న వారందరూ, బైరాగి నేర్పిన మంత్రం గొప్ప ప్రభావం కలదని నమ్మారు.

అప్పటి నుంచి గ్రామంలో ఎవరిని పాము కరిచినా, వాళ్ళను పుల్లయ్య దగ్గరకు తీసుకురావడం, అతడు మంత్రం వేయగానే వాళ్ళు లేచి కూర్చోవడంతో పుల్లయ్య ఖ్యాతి చుట్టుపక్కల గ్రామాలకు కూడా పాకింది. మంత్రం వేయించుకున్న వాళ్ళు అతడికి, తృణమో పణమో ముట్టజెప్పటంతో, పుల్లయ్య ఆర్థికపరిస్థితి కూడా బాగా మెరుగైంది.

అతడు తన చేనుకు పక్కన వున్న నాలుగైదెకరాల పొలం కొన్నాడు. పూరింటి స్థానంలో ముచ్చటగొలిపే డాబా ఇల్లు కట్టాడు. కుమార్తెకు పక్క గ్రామంలోని సంపన్న కుటుంబీకుడి కొడుకుతో వివాహం జరిపించాడు. ఇప్పుడు తను ధనవంతుడైనందుకు ఏమాత్రం అహంకరించకుండా, ఎప్పటిలాగే పొలంపని చేసుకుంటూ, ఉన్నంతలో దానధర్మాలు చేస్తూ సుఖంగా కాలం గడపసాగాడు.

ఇలాంటి పరిస్థితుల్లో – ధనార్జనకోసం ఏనాడో గ్రామం వదిలి దూరప్రాంతాలకు పోయిన మునిస్వామి అనే పుల్లయ్య మిత్రుడు, అతడి పేరుప్రఖ్యాతులు విని చాలా సంతోషించి, చూడవచ్చాడు. ఒక వారంరోజులపాటు మిత్రులిద్దరూ తమ చిన్ననాటి జ్ఞాపకాలూ, ఇప్పటి సుఖమయ జీవితాన్ని గురించీ ముచ్చటించుకున్నాక,



తిరిగి వెళ్ళే సమయంలో మునిస్వామి, పుల్లయ్యతో, "నువ్వు పరోపకారం చేస్తూ, అంతో ఇంతో ధనం గడిస్తున్నావు. చాలా మెచ్చదగిన సంగతి. సరే, ఇంతకూ నీకా బైరాగి నేర్పిన పాముమంత్రం ఏమిటో చెప్పావు కాదు," అన్నాడు.

మిత్రుడడిగిన దానికి పుల్లయ్య చాలా సంతోషించి, "ఏముందిరా! జోగివచ్చే జొన్నలు తినే, ఉరోజావ్ - అంతే!" అన్నాడు.

ఇది విని మునిస్వామి పెద్దగా నవ్వి, "ఇదా పాముమంత్రం! నిన్నా బైరాగి నిలువునా మోసగించాడు. వాడు ఉత్తరాది వాడై వుండాలి. నీ జొన్న చేనంతానాశనం చేసినా, నువ్వు చూస్తూ వూరుకోవడంతో నిన్ను అమాయకుడికింద జమకట్టాడు. వాడికే మంత్రాలూ రావని, నా నమ్మకం. పాముమంత్రం నేర్పమని నువ్వు కాళ్ళ మీద పడడంతో, వాడు కోపగించుకుని, నీ చేలో జొన్నలు తినేశాం, ఇక లేచిపో అంటూ నిన్ను తిట్టాడు. ఉరోజావ్, అంటే అదీ అర్థం!" అన్నాడు.

తన చిన్ననాటి మిత్రుడు మునిస్వామి అబద్ధమాడడని, పుల్లయ్యకు తెలుసు. అందువల్ల, బైరాగి తనను మోసగించాడనీ, తను వేస్తున్నది పాముమంత్రం కాదనీ, ఒట్టి బూటకమనీ పుల్లయ్య బాధపడసాగాడు.

ఇది జరిగిన వారంరోజులకు, పాము కాటువేసిన పొరుగు గ్రామం వాణ్ణొకణ్ణి పుల్లయ్య దగ్గరకు తీసుకు వచ్చారు. పుల్లయ్య మంత్రం వేయడమా, మానడమా అని సంశయిస్తూనే, మంత్రాన్ని మనసులో మననం చేసుకుంటూ, పాముకాటు తిన్న వాడి భుజం మీద గట్టిగా కొట్టాడు. వాడిలో ఏమాత్రం చలనం కనిపించలేదు.

వెంటనే పుల్లయ్య అక్కడవున్న వాళ్ళతో, "నేను ఒక అపచారం చేయడం వల్ల,నా పాముమంత్రం ఫలించకుండా పోయింది. ఇతణ్ణి వెంటనే పట్టణానికి తీసుకుపోండి. అక్కడ మంచి వైద్యులున్నారు," అన్నాడు.

ఆ విధంగా, పుల్లయ్యకు మంత్రశక్తి పోయిందని అందరికీ తెలిసిపోయింది. ఆ తర్వాత, నిజాయితీపరుడైన పుల్లయ్య లేనిపోని ఆశలకు పోకుండా, అంత వరకూ తను సంపాదించిన దానితో శేష జీవితాన్ని హాయిగా గడిపేశాడు.





# బంగారు గడియలు-16



**1. పునాది లేని స్తంభం...?**

వేదికమీద నిలబెట్టబడిన ఈ స్తంభం దానితో ఏ విధంగానూ కలపబడిలేదు! 900 సంవత్సరాలకు పూర్వం విష్ణువర్ధనుడనే హొయసాలరాజు దీనిని నిర్మించాడు. దీనిని 'అకర్షణస్తభం' అని కూడా అంటారు.



## ప్రపంచంలో వీటిని మనం ఎక్కడ చూడగలం?



**2. ప్రపంచంలోకెల్లా చాలా ఎత్తయిన రైల్వే మార్గం...?**

ఎండెస్ కొండల మీద సముద్రమట్టానికి 4816మీ॥ఎత్తులో ఉన్న ఈ రైలు మార్గంలోపయనిస్తున్నప్పుడు వాయుపీడనం తగ్గడంవల్ల కొందరు ప్రయాణీకులకు ప్రాణవాయువు అవసరమవుతుంది. ప్రయాణీకులకు అవసరమైతే వైద్యసహాయం అందజేయడానికి నర్సులు సిద్ధంగా ఉంటారు.



**3. పూర్తిగా రాతి ఉప్పుతో నిర్మించబడిన భూగర్భ పట్టణం...?**

ఇది భూమికి 300మీ అడుగున ఉన్న ఉప్పుగని మధ్య ఉన్నది. విలక్షణమైన ఈ పట్టణం, దశాబ్దాల గని కార్మికుల శ్రమ ఫలితం. గని కార్మికులు ఇక్కడ ఒకచర్చ్, రైల్వే స్టేషన్, బాల్‌రూమ్ – అన్నిటినీ రాతిఉప్పు నుంచే తొలిచి ఉన్నారు!

జంతుప్రహేళిక

## నే నెవరిని?



1. నేను పొట్టికాళ్ళు గల పక్షిని, గాలిలో ఎగర లేను కాని నీళ్ళలో చక్కగా ఈదగలను.
2. నేను చాలా విధాలుగా మనిషిని పోలి ఉంటాను. అయితే వేలికణుపుల మీదే నడుస్తాను.
3. ఈ భూమి మీద నివసించిన జంతువులన్నిటిలోకీ చాలా పెద్ద జంతువును.
4. నేను ఎగురలేని పక్షిని. నా దేశ ప్రజలు తరచూ నా పేరుతో పిలువబడతారు.



5. పక్షులలోకెల్లా నేనే చాలా పెద్ద పక్షిని.
6. నాకు పెద్ద మూపురం ఉన్నది. ఎడారి ఓడగా నన్ను చెబుతారు.
7. ఆస్ట్రేలియా అడవికుక్క అని నన్ను పిలుస్తారు.

కథా ప్రహేళిక

## చేసిన పొరబాటు

కాలేజీ హాస్టల్‌లో వుంటూ చదువు కుంటూన్న ఒక కుర్రవాడి గదిలో చాలా డబ్బు ఉందని గౌరవ్‌కు తెలియ వచ్చింది. వెంటనే వాడు తన ఇంటి కెదురుగుండా ఉన్న సైకిల్ షాపునుంచి సైకిల్‌ను అద్దెకు తీసుకుని వేగంగా తొక్కుకుంటూ హాస్టలుకు చేరాడు. సైకిల్ స్టాండులో సైకిలు వదిలి మెట్లెక్కి కుర్రవాడి గది దగ్గరికి వెళ్ళాడు. తలుపు తాళం వేసి వున్నది. అయినా తాళాన్ని పగలగొట్టడం వాడికి కష్టమ నిపించ లేదు. వాడు డబ్బు తీసుకుని గబగబా మెట్లు దిగి సైకిలు స్టాండుకు చేరాడు. కొంతసేపటికి మెయిన్‌రోడ్డుకు చేరుకున్నాడు. వాడు విజయోత్సాహంతో ఈల వేస్తూ వెళుతూ, హఠాత్తుగా భయంకరమైన పొరబాటు చేసినట్టు గ్రహించి ఆగిపోయాడు. వాడు హాస్టలుకు వెనుదిరిగాడు. కాని అప్పటికే ఆలస్యమ యింది. ఫుట్ బాల్ ఆట ముగించి హాస్టలుకు చేరిన కుర్రాళ్ళకు జరిగిన దొంగతనం గురించి తెలిసిపోయింది. వాడు సైకిల్‌ను వెనుకకు తిప్పి, పారిపోయాడు. పోలీసులుత్వరలో ఇంటికి రాగలరని గ్రహించడంతో వాడు తన ఇంటికేసి వెళ్ళడానికి కూడా సాహసించలేక పోయాడు.

వాడు వదిలి వెళ్ళిన ఆధారం ఏమిటో చెప్పగలరా?



సరదా ప్రశ్నలు

# జాగ్రత్త సుమా! తికమక పెట్టే ప్రశ్నలు!

1. ఎందుచేత 'తేనెమిడత' గెంతడం గాని, ఎగరడం గాని చేయజాలదు?
2. ఆస్ట్రేలియా ఆదివాసులు మళ్ళీ తమ వద్దకు తిరిగి వచ్చేలా 'బూమెరాంగ్'ను విసరగలరు: మామూలు టెన్నిస్ బాల్‌తోకూడా ఆ ట్రిక్కును చేయవచ్చు అది ఎలా?



3. ఈ చిత్రంలో ఒక పొరబాటు ఉన్నది. ఏమిటది?



4. నా మిత్రుడు ఒక కాగితం, పెన్సిల్ తీసుకుని, "నా ఎడమ చెవితో రాయగలను," అని నాతో అన్నాడు. చెయ్ చుద్దాం అని సవాలుచేశాను. అతను రాసి చూపాడు. ఎలా?
5. ఒక ఏనుగు మీ జేబు రుమాలుపై కూర్చుంటే మీరేం చేస్తారు.



6. ఒక సంవత్సరం తరవాత లేగదూడ ఏమవు తుంది?
7. ప్రతి ఒక్కరూ ఒకే సమయంలో చేసే పని ఏమిటి?

చేసి చూడండి

## చుక్కల అగ్గిపెట్టె కుక్క బొమ్మ

### కావలసిన వస్తువులు:

రెండు ఖాళీ అగ్గిపెట్టెలు; మూడు ఐస్‌క్రీమ్ పుల్లలు; అగ్గి పెట్టెలపై అతికించడానికి తెల్ల కాగితం; పేనాకత్తి; నలుపురంగు ఫెల్ట్‌పెన్; జిగురు.

### తయారుచేసే పద్ధతి:

1. అగ్గిపెట్టెలపై తెల్లకాగితాన్ని అతికించండి. ఐస్‌క్రీమ్ పుల్లల మీద నలుపురంగు వేయండి.
2. ఒక ఐస్‌క్రీం పుల్లను ఒక అగ్గిపెట్టె అడుగుభాగం లోపలా రెండవ అగ్గిపెట్టె పైభాగంలో వచ్చేలా అమర్చండి.
3. రెండవ ఐస్‌క్రీం పుల్లను సగంగా కత్తిరించి, తోక భాగం, ముందు మోకాలు వచ్చేలా, అగ్గిపెట్టె లోపలికి దోపి అమర్చండి. మూడవ పుల్లను సగంగా కత్తిరంచి 'తలకు' రెండు వైపులా చెవుల్లా జిగురుతో అతికించండి.
4. కంటినీ, నవ్వేనోటినీ, వంటి మీది చుక్కలనూ మీ కుక్కపిల్లకు దిద్దండి.



## బొమ్మవేసి చూద్దాం:



అంకె **5**ను
కోపంగా ఉన్న పక్షిగా
ఎలా మార్చవచ్చో

5





ఇక్కడ చూడండి!

అంకె **6**

6





ఏడుస్తున్న పాపాయిగా!

## బంగారు గడియలు నెం **15**. సమాధానాలు

### ప్రపంచంలో ఎక్కడ

1. దక్షిణ అమెరికాలోని గౌటమాల. 2. అస్సాంలోని జతీంగా.
3. టర్కీలోని ఇస్తాన్‌బుల్.

### చిత్రప్రహేళిక:

1. ఆక్టోపస్ 2. షార్క్ 3. స్టార్‌ఫిష్ 4. డాల్ఫిన్ 5. సముద్రపుతాబేలు 6. జెల్లీ చేప.

### కథా ప్రహేళిక:

వెలుపలి నుంచి కిటికీ తలుపుల అద్దాలు పగలగొట్టి వున్నట్టయితే అద్దం ముక్కలు ఇంటి లోపల పడివుండాలి. అద్దం ముక్కలు కిటికీ వెలుపల తోటలో పడివుండడం వల్ల, అద్దాలను లోపలినుంచే పగలగొట్టి ఉండాలి. దొంగతనం జరిగినప్పుడు ఇంట్లో ఇంటి కాపలాదారు మాత్రమే ఉండడం వల్ల వాడే దొంగ అని తేలిపోయింది.

### సరదా ప్రశ్నలు

1. ఎ కప్పులో 1 పంచదార అచ్చు, బి కప్పులో 2 అచ్చులు, సి కప్పులో 3 అచ్చులు వేయండి. తరవాత సి కప్పును బి కప్పులో ఉంచండి. ఇప్పుడు ప్రతి కప్పులోనూ బేసి సంఖ్య అచ్చులే ఉన్నాయి! 2. మీ తల్లి! 3. బొగ్గు 4. ఒకటే! బోనులోకి ఒక కోతి వెళ్ళాక అది ఖాళీ కాదుకదా! 5. అవి నడవలేవు గనక! 6. ఆగిపోయిన గడియారం!




"పాండవులూ, ద్రౌపదీ విరాటరాజు వద్ద గుట్టుగా అజ్ఞాతవాసం చేస్తున్నారు. ధర్మరాజు పాచికలాటలో డబ్బు గెలిచి తన తమ్ములకు పంచి పెట్టేవాడు. భీముడు తాను వండిన రకరకాల మాంసాలు మిగిలిన వారికి ఇచ్చేవాడు. అర్జునుడు అంతఃపురంలో తనకు లభించే పాత బట్టలను అందరికీ చేర్చేవాడు. నకులుడు తన అశ్వపోషణకు మెచ్చి రాజు ఇచ్చే బహుమానాలను మిగిలిన వారికి పంచే వాడు. సహదేవుడు పాలూ, పెరుగూ అందించేవాడు. ద్రౌపది తన భర్తలంద రినీ కనిపెట్టుతూ తన రహస్యం బయట పడకుండా మసలుకుంటున్నది. తమ ఆచూకీ దుర్యోధనుడికి తెలిసి పోతుందన్న భయం అందరికీ ఉన్నది.

ఇలా నాలుగు మాసాలు గడిచింది. అప్పుడు మత్స్యదేశంలో బ్రహ్మోత్సవం జరిగింది. ఆ ఉత్సవానికి దేశదేశాలనుంచి మల్లులు వచ్చారు. విరాటరాజుకు మల్ల యుద్ధం గురించి బాగా తెలుసు. అందు చేతఆయన మల్లవీరులకు చక్కని సౌక ర్యాలు కలిగించి, వారి మధ్య యుద్ధాలు ఏర్పాటు చేసి చూసి ఆనందిస్తూ వచ్చాడు.

అలా వచ్చిన మల్లులలో జీమూతుడనే వాడు మహాబలశాలి. వాడుఅందరినీతనతో యుద్ధం చెయ్యమని పిలిచేవాడు. మిగిలిన మల్లులు వాడితో యుద్ధం చెయ్యటానికి భయపడ్డారు. అందుచేత విరాటుడుతన వంటవాడుగా ఉంటున్న భీముణ్ణి పిలిచి, జీమూతుడితో మల్లయుద్ధం చెయ్యమ న్నాడు. రాజు ఆజ్ఞాపిస్తే కాదనటం బాగుం డదని భీముడు సమ్మతించాడు.

భీముడూ, జీమూతుడూ రెండు మదపు టేనుగుల లాగా మల్లయుద్ధం ప్రారంభిం చారు. మాహా దారుణమైన వారి యుద్ధం



చూసి ప్రేక్షకులు పరమానందం చెందారు. భీముడు జీమూతుణ్ణి పట్టుకుని గిరగిరా తిప్పేసరికి మిగిలిన మల్లులు దిగ్భ్రమ చెందారు. భీముడు జీమూతుణ్ణి అలా తిప్పి, తిప్పి నేల కేసి కొట్టి, చంపేశాడు. జీమూతుణ్ణి జయించిన భీముడికి విరాటుడు అంతులేని ధనం కానుక ఇచ్చాడు.

భీముడి శక్తి సామర్థ్యాలు చూసి రాజు అతనిని మల్లులతోనే గాక, సింహాలతోనూ, ఏనుగులతోనూ, పులులతోనూ పోట్లాడించి వినోదించేవాడు. ఈ పోరాటాలు చూడటానికి అంతఃపుర స్త్రీలు కూడా వచ్చేవారు.

అర్జునుడు అంతఃపుర స్త్రీలచేత పాటలు పాడించి, నాట్యాలు చేయించి రాజుకు ఆనందం కలిగించేవాడు. పొగరుబోతు గుర్రాలను అధీనంలోకి తెచ్చి, వాటికి కళ్ళాలు తగిలించి, రాజుకు చూపి నకులుడు చాలా ధనం బహుమానంగా పొందాడు. అలాగే సహదేవుడు పొగరైన ఆబోతులను మచ్చిక చేసి బహుమతులు సంపాదించాడు. తన భర్తలు రాజు కొలువులో పడేపాట్లు చూసి ద్రౌపది బాధపడేది.

ఈ విధంగా పాండవుల అజ్ఞాతవాసం దాదాపు ఏడాది పూర్తికావచ్చింది. ఆ సమయంలో ద్రౌపది పాలిటికి సింహబలుడు అనే కీచకుడు దాపరించాడు. ఈ కీచకుడు విరాటరాజు బావమరిదీ, సేనాపతి కూడానూ. అతను సుధేష్ణ ఇంట ద్రౌపదిని చూసి మోహపరవశుడై, తన చెల్లెలితో, "నేనీమెను ఇక్కడ ఇదివరకు చూడలేదు. ఈమె అందం నన్ను సమ్మోహితుణ్ణిచేస్తున్నది. ఈమె ఎవరు? అప్సరసలాటిరూపం గల ఈమె ఎక్కడినుంచి వచ్చింది? ఇంత సౌందర్యవతి చేత చాకిరీ చేయించడమేమిటి? ఈమె నా ఇంటికివస్తే పువ్వుల్లో పెట్టి పూజిస్తాను," అన్నాడు.

అతను సుధేష్ణ వద్ద సెలవు పుచ్చుకుని, ద్రౌపది ఒంటరిగా ఉన్నప్పుడు ఆమెకు తన కోరిక తెలిపాడు.

ద్రౌపది అతనితో, "నాతో ఇలా మాట్లాడటం తప్పు; నేను మరొకరి భార్యను. నన్ను కోరటం నీకు కీడు," అన్నది.

"నన్ను అలా తోసిపుచ్చకు. తరవాత పశ్చాత్తాప పడగలవు. ఈ రాజుకూ, రాజ్యానికీ నేనే ఆధారం. భోగభాగ్యాలలోనూ, రూపంలోనూ, యౌవనంలోనూ, నన్ను మించిన వాళ్ళు ఈ లోకంలో లేరు. అలాటి నన్ను నీ సేవకుడుగా చేసుకుని వివిధ



భోగాలు అనుభవించక దాసిగా ఎందుకు పని చేస్తావు?" అన్నాడు కీచకుడు.

ద్రౌపది మండిపడి, "నా మీద మోహం విడిచి పెట్టక పోయావో నీ ప్రాణాలకు అపాయం ఉన్నది. నా భర్తలైన అయిదుగురు గంధర్వులు నన్ను అహర్నిశలు జాగ్రత్తగా కనిపెట్టి ఉంటారు. వారికి నీసంగతితెలిస్తే ఎవరూ కాపాడేవాళ్ళు లేరు," అన్నది.

ద్రౌపది ఈ మాటలు అన్నా కూడా కీచకుడు నిరుత్సాహ పడలేదు. అతనికి ఆమెమీది మోహం అంతకంతకూ ఎక్కువ కాసాగింది. అతను మళ్ళా సుధేష్ణ వద్దకు వెళ్ళి, "ఎలాగైనా సైరంధ్రిని నాకు దక్కేటట్టు చేయకపోయావో, నా ప్రాణాలు నిశ్చయంగా పోతాయి. నేను ఎన్ని రకాల ప్రార్థించినా ఆమె మనసు నా కేసి మరలటం లేదు," అన్నాడు.

సుధేష్ణ అన్న దుస్థితి చూసి చాలా బాధపడి, "సైరంధ్రి నాకు ఆశ్రితురాలు. ఆమెను రక్షిస్తానని నేను మాట ఇచ్చాను. తనకు అయిదుగురు గంధర్వులు భర్తలని ఆమె మొదటనే చెప్పింది. సైరంధ్రి మీద భ్రమ పెట్టుకుని ప్రాణాపాయం తెచ్చుకోకు," అన్నది.

"వెయ్యిమంది గంధర్వులు కూడా నన్నేమీ చెయ్యలేరు. నా వంటి అందగాణ్ణి ఎంతటి పతివ్రత అయినా కోరుతుంది. నా వైభవం చూసి సైరంధ్రి మనసు నా మీదికి తప్పక తిరుగుతుంది. ఎలాగైనా ఆమెను నాకు అనుకూలవతిని చేసి నా ప్రాణాలు నిలబెట్టు," అంటూ కీచకుడు తన చెల్లెలిని బతిమాలసాగాడు.

"ఓరీ, పాపీ! నువ్వు కూడని పని తలపెట్టటమే గాక అందుకు నన్ను సాధనంగా ఉపయోగించుకో జూస్తున్నావు. నీ పాపం నీతో పోదు, కులాన్నే నాశనం చేస్తుంది. నువ్వు ఇంటికివెళ్ళి. కల్లూ, మధురాన్నమూ సిద్ధం చేయించి ఉంచు. వాటిని తీసుకు రావటానికి సైరంధ్రిని పంపుతాను.ఆమెను ఎలా లోబరుచుకుంటావో!" అన్నదిసుధేష్ణ.

కీచకుడు వెంటనే తన ఇంటికి వెళ్ళి, భక్ష్య భోజ్య పానీయాలు తయారు చేయించి, ద్రౌపది కోసం చూడసాగాడు.

తరవాత సుధేష్ణ ద్రౌపదితో, "సైరంధ్రీ, నాకు చాలా దాహంగా ఉన్నది. నువ్వు కీచకుడి ఇంటికి వెళ్ళి, తాగటానికి ఏమైనా తీసుకురా," అని ఆజ్ఞాపించింది.

"అమ్మా, నేను అతని ఇంటికి వెళ్ళ లేను. అతను మోహావేశంతో కొట్టుకు పోతున్న సంగతి నీకు తెలుసు గదా. నేను వెళితే అతను తప్పక నన్ను అవ మానపరుస్తాడు. నీ వద్ద ఇంకా ఎందరో పరిచారికలున్నారు. వారిలో ఎవరినైనా పంపు," అన్నది ద్రౌపది.

"కల్లు తెమ్మని నేనై పంపుతూంటే, వాడునిన్ను తాకగలడా?" అంటూ సుధేష్ణ ద్రౌపదికి ఒక బంగారుపాత్ర ఇచ్చింది.

గత్యంతరం లేక ఆ పాత్ర తీసుకుని ద్రౌపది కీచకుడి ఇంటికి వెళ్ళింది. ఆమెను చూస్తూనే కీచకుడు పరమానందంతోలేచి, "సుందరీ, నీకు స్వాగతం. నా ప్రాణేశ్వరివైన నువ్వు నా దగ్గిరికి వచ్చావు. నా కోరిక తీర్చు. దివ్యాంబరాలు ధరించి, రత్నాలంకా రాలు అలంకరించుకో. నాతో కలిసితాగి, సుఖంగా ఉండు," అన్నాడు.

"రాణిగారు కల్లు తెమ్మని పంపింది. ఆమెకు చాలా దాహంగా ఉన్నదట. వెంటనే కల్లు ఇప్పిస్తే నేను పోతాను," అన్నది ద్రౌపది.

"కల్లు మరొకతె చేత పంపిస్తాలే," అంటూ కీచకుడు ఆమె చేతిని పట్టు కున్నాడు. ద్రౌపది కంగారు పడుతూ కీచ కుణ్ణి ఒక్క తోపుతో పడదోసి, పరిగెత్తు కుంటూ విరాటరాజు సభలోప్రవేశించింది. కీచకుడు ఆమె వెంటపడి, విరాటరాజు చూస్తూండగానే జుట్టు పట్టుకుని ఆపాడు.

ఈ దురన్యాయాన్ని ధర్మరాజూ, భీముడూ సభలో ఉండి కళ్ళారా చూశారు. భీముడికి ఆ క్షణంలోనే కీచకుణ్ణి చంపా



లనిపించి, పళ్ళుపటపటా కొరికాడు. అతని శరీరమంతా చెమటపట్టింది. కళ్ళ నిప్పులు రాలాయి. ఎదురుగా కనబడే చెట్టును పీకే ఉద్దేశంతో అతను లేచాడు.

ధర్మరాజు భీముడి కాలి బొటనవేలిని తనబొటన వేలితో నొక్కి, "ఏమోయ్, కట్టెల కోసం ఈ చెట్టును ఎందుకు పడ గొడతావు? అవతల ఇంకా చాలా చెట్లు న్నాయి. వాటిని పడగొట్టు," అన్నాడు.

ఈ లోపల ద్రౌపది తన భర్తల అశక్తత గ్రహించి, చుర చురా చూస్తూ విరాటుడి కేసి తిరిగి, "ఈ నీచుడు నన్నిలా అవమా నిస్తూ ఉంటే మహా బలులైన నా భర్తలు గంధర్వులు, కాలానికి కట్టుపడి నన్ను కాపాడలేని స్థితిలో ఉన్నారు. అలాటప్పుడు రాజువైన నీవైనా రక్షకుడివై, మానభంగం




కలగకుండా చూడడానికి బదులు ఉపేక్షిస్తావా?" అని సభలో వారితో, "రాజుకూ, కీచకుడికిలాగే మీకు కూడా ధర్మం తెలియదులాగుంది," అన్నది.

అప్పుడు విరాటరాజు, "ఏమమ్మా, మీఇద్దరికీ పరోక్షంగా ఏమి తగాదా వచ్చినదీ తెలియకుండా నేను ఎలా మీమధ్య ధర్మనిర్ణయం చెయ్యగలను?" అని ద్రౌపదితో అన్నాడు. అప్పుడు ధర్మరాజు ద్రౌపదితో, "ఓసీ, నువ్వు ఇక్కడ తారట్లాడక అంతఃపురానికి పో. నీ భర్తలు ఏమీ చెయ్యకపోతే దానికికారణం ఉండే ఉంటుంది. దేశమూ, కాలమూ ఆలోచించకుండా శోకాలు పెట్టి రాజసభలో ఎందుకు గల్లంతు చేస్తావు? నీకు అపకారం చేసిన వారిని నీ భర్తలే దండిస్తారులే," అన్నాడు.

ద్రౌపది సుధేష్ణ మందిరానికి తిరిగి పోయి, జుట్టు విరబోసుకుని, శోకదేవత లాగా కూర్చున్నది. ఆమె అవతారంచూసి సుధేష్ణ, "మాలినీ, ఎవరు నీకు కష్టం కలిగించారు?" అని అడిగింది.

"నువ్వు కల్లు తెమ్మని పంపిస్తే కీచకుడు నన్ను బాధించి, నిండు సభలో పరాభవించాడు. ఇలా చెయ్యటం వల్ల ఎవరికి రోషం వస్తుందో వాళ్ళే అతని అంతు చూస్తారు," అన్నది ద్రౌపది.

నిజంగా కీచకుణ్ణి చంపించటానికే ఆమె నిశ్చయించుకున్నది. ఆమె రాత్రివేళ భీముడుండే ఇంటికి వెళ్ళింది. భీముడు బుసలు కొట్టుతూ గాఢ నిద్రలో ఉన్నాడు. ద్రౌపది అతని వద్దకు వెళ్ళి, గట్టిగా కౌగలించుకుని, "చచ్చిపోయిన వాడిలాగా ఇలా చలనంలేకుండా ఉన్నావేం? బతికున్నవాడు తన భార్యను ఎవడన్నా ఇలా నిండు సభలో అవమానం చేస్తే ఊరుకుంటాడా? లే, లే!" అన్నది.

భీముడు మేలుకుని పక్కమీదినుంచి లేచి, "ఏమిటి ఇలా పాలిపోయి, చిన్నబోయి ఉన్నావు? ఇక్కడికెందుకువచ్చావు? నావల్ల కావలిసినపని ఉంటే చెప్పి, ఎవరికీ తెలియకుండా త్వరగా వెళ్ళి పడుకో," అన్నాడు.

"అన్నీ తెలిసి నన్నెందుకిలా అడుగుతున్నావు? మీ అన్న జూదగాడు కావటంతో నాకు ఇన్ని పాట్లు వచ్చాయి. నేను ఈ విరాటుడి భార్య దగ్గిర సేవలు చేస్తూ ఉండటమే గాక కీచకుడు నా వెంటబడి నాకు సహించరాని అవమానం చేశాడు.

చాకిరి చేసి చేసి నా చేతులు ఎలా మొర టుదేలాయో చూడు," అంటూ ద్రౌపది భీముడికి తన చేతులు చూపింది.

భీముడు ఆమెతో, "ఆ కీచకుడునిన్ను సభలో కాలితో తన్నినప్పుడు వాణ్ణి అక్కడే చంపేద్దామనుకున్నాను గాని, ధర్మరాజు వారించాడు. ఆ రోజే దుర్యోధన కర్ణ శకుని దుశ్శాసనుల తలలు పగల గొట్టక పోతినే! కొద్ది రోజులు ఓర్చుకున్నావంటే తిరిగి నువ్వు మహారాణివి అవుతావు," అన్నాడు.

"ఈ దుఃఖం భరించటం నా వల్లకాదు. నేను తిరిగి రాణిని కావటం అబద్ధం. ఈ కబుర్లన్నీ దేనికి? ఇప్పుడు జరిగిన దానికి ప్రతీకార మార్గం ఆలోచించు. సుధేష్ణకన్న నేను బాగుంటానని విరాటుడు చూస్తు న్నాడు. అది తెలిసి కీచకుడు నా వెంట పడ్డాడు. నాకు అయిదుగురు గంధర్వులు భర్తలున్నారనీ, వాళ్ళు ప్రాణాలు తీస్తారనీ మంచిగా చెప్పి చూశాను. కాని వాడు నా మాట లక్ష్యపెట్టడు. సుధేష్ణ వాడికి సహాయం వచ్చి, కల్లు తెమ్మని నన్ను వాడి ఇంటికి పంపింది. వాడు నన్ను పట్టుకోబోయాడు. నేను పారిపోయి వచ్చి రాజభవనంలో దూరాను. అందరూ చూస్తూండగా ఆదుర్మార్గుడు నన్ను కాలితో తన్నాడు. ఈ దుర్మార్గుణ్ణి నువు కుండను పగలగొట్టినట్టు ధ్వంసం చెయ్యకపోతే నేను విషం తాగి చస్తాను," అంటూ భీముణ్ణి గట్టిగా కౌగలించుకుని ఏడ్చింది ద్రౌపది.

భీముడు ఆమెను గట్టిగా పట్టుకుని కన్నీరు తుడుస్తూ ఓదార్చి, "నువ్వు చెప్పినట్టే వాణ్ణి చంపేస్తాను. దానికి నువ్వు ఒకపని చెయ్యాలి. ఇలా ఏడుపు మొహంతోకా కుండా, నవ్వుతూ కళకళలాడే మొహంతో కీచకుణ్ణి కలుసుకుని, వాడి కోరిక తీర్చే దానిలాగా అభినయించు. నర్తనశాలలో పగలు స్త్రీలు ఆడుతారు, పాడుతారు. రాత్రివేళ అక్కడ ఎవరూ ఉండరు. అక్కడ రాత్రికి అక్కడికి వాణ్ణి రమ్మను. మూడో కంటి వాడికి తెలియకుండా అక్కడ కీచకుణ్ణి వాడి తాతల వద్దకు పంపు తాను," అన్నాడు.

ఇలా మంత్రాలోచన చేస్తూ వాళ్ళు ఆ రాత్రి గడిపారు.



# వార్తలలో బాలలు

### ఆరవయేట డ్రైవింగ్!

పసిపిల్లలు కారు స్టీరింగ్ దగ్గర, బోనెట్ మీద కూర్చుని ఫోటోలకు దిగడానికిఉత్సాహం చూపడం సర్వసాధారణమైన విషయం. అయితే ఆరేళ్ళ పసివాడు స్టీరింగ్ పట్టుకుని కారు నడపడం మీరెప్పుడైనా చూశారా? చెన్నయ్, వానగరానికి చెందిన సదాశివం అనే ఆరేళ్ళ కుర్రాడు మారుతి 'ఆమ్ని' కారును నడుపుతున్నాడు! గత జనవరినుంచి వాడీ అపూర్వమైన పని చేస్తున్నాడు. ఆ పసివాడి తండ్రి మురళి, తల్లి పద్మావతి. వానగరంలోని శ్రీ ఆదిత్య మెట్రిక్యులేషన్ స్కూలులో ఒకటవ తరగతి చదువుతూన్న సదాశివం యుకెజిలో ఫస్ట్ర్యాంకు సాధించాడు. వక్తృత్వ పోటీలోనూ ప్రథముడుగా వచ్చాడు!



### తొమ్మిదవయేట మెట్రిక్!

తొమ్మిదవయేటే సి.బి.ఎస్.ఇ (సెంట్రల్ బోర్డ్ ఆఫ్ సెకండరీ ఎడ్యుకేషన్) పదవతరగతి పాసవడం అపూర్వమయిన విషయం. గత మేనెలలో ఢిల్లీకి చెందిన తథాగత అవతార్ తులసీ ఈ కొత్త రికార్డును సృష్టించాడు. అది అతనికి ఎలా సాధ్యమయింది? అందరి పిల్లల్లాగా అతడు నర్సరీ క్లాసులో చేరలేదు. చేరడమే సరాసరి 3వ తరగతిలో చేరాడు. అంతేకాదు; ఆ సంవత్సరమే 4,5 తరగతుల సిలబసు కూడా పూర్తిచేశాడు. కాబట్టి మరుసంవత్సరం 6వ తరగతికివెళ్ళాడు. 1995వ సం॥లో ఢిల్లీలోని ఒక పబ్లిక్ స్కూల్లో ఏడవ తరగతిలో చేరాడు. 1996-97 విద్యా సంవత్సరంలో 8వ తరగతి చదివాడు. అదే సమయంలో 9,10 తరగతుల సిలబసు కూడా పూర్తిచేసి పబ్లిక్ పరీక్ష రాయడానికి అనుమతి కోసం దరఖాస్తు పెట్టాడు. అందుకు నిర్దేశించిన వయసు రాలేదు కాబట్టి సి.బి.ఎస్.ఇ. అభ్యంతరం తెలియజేసింది. అతని తండ్రి కోర్టుకు వెళ్ళాడు. తులసీకి హాల్‌టికెట్ ఇవ్వాలని కోర్టు ఫిబ్రవరి 26వ తేదీ సి.బి.ఎస్.ఇని ఆదేశించింది. ఇవాళ ప్రపంచం మొత్తంమీద మెట్రిక్ పాసయిన అతి పిన్న వయస్కుడు తానే అన్న రికార్డు సృష్టించాడు ఈ బాలమేధావి!



### ప్రపంచ రికార్డు!

వెల్లకిలా పడుకున్న పహిల్వాన్ మీద కారును, జీపును నడిపించడం సర్కస్‌లో చూసి ఉంటారు. మూడేళ్ళ క్రితం బీహార్ రాష్ట్రంలోని ధన్‌బాద్‌కు చెందిన పదిహేనేళ్ళ సుమీతా సింగ్ మీద 1,550 కి.గ్రా బరువుగల కారును నడిపించారు. గత ఏప్రిల్ నెలలో 3,200 కి.గ్రా బరువైన ట్రక్కును ఆయువతి కడుపుమీద నడిపించారు. ఇది ఒక ప్రపంచ రికార్డు. కరెంటు బల్బులను పగలగొట్టి, వాటి ముక్కలను మింగడం సుమీతకు మంచి నీళ్ళప్రాయం. ఇటీవల ఆమె కడుపు మీద 100కి.గ్రా. బరువుగల రాయిని వుంచి, 5 కి.గ్రా. బరువైన సమ్మెటతో ముక్కలుగా పగలగొట్టారు!

చందమామ అనుబంధం 106



మనదేశపు అందచందాలు

# శ్రావణ బెళగొళ

కర్నాటక రాష్ట్రంలో బెంగళూరుకు సమీపంలో శ్రావణ బెళగొళ అనే చిన్న పట్టణం ఉన్నది. ఇక్కడి 'ఇంద్రాద్రి' అనే కొండమీద గోమతే శ్వరుడని ప్రఖ్యాతిగాంచిన బ్రహ్మాండమైన బాహుబలి విగ్రహం ఉన్నది. (ఇది 17 అడుగుల ఎత్తయిన ఏకశిలా విగ్రహం.)





ఇక్కడ పన్నెండు సంవత్సరాల కొకసారి 'మహామస్తకాభిషేకం' అనే ఉత్సవం భారీ ఎత్తున జరుగుతుంది. ఈ ఉత్సవానికి దేశం నలుమూలల నుంచి వేలాది భక్తులు వచ్చి గోమతేశ్వర పూజలో పాల్గొంటారు. ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఎత్తయిన వేదికల మీద నిలబడి, పూజారులు పెద్ద పెద్ద కలశాలతో పాలు, పెరుగు, తేనె, కొబ్బరినీళ్ళు, పసుపునీళ్ళు మొదలైన పుణ్య జలాలతో గోమతేశ్వర విగ్రహం శిరస్సును అభిషేకిస్తారు. ఆ జలంలో బంగారు, వెండి నాణాలు కూడా వేస్తారు.

రాచమల్లురాజు ఆస్థానంలో సర్వసేనాధిపతి పదవిని నిర్వహించిన చాముండ రాయుడు క్రీ.శ. 981వ సం॥లో ఈ ఏకశిలా విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు. ఆనాటి నుంచి అది యేటా లక్షలాది యాత్రికులను ఆకర్షిస్తున్నది.

పురాణకాలంనాటి రాజులు :

# హరితస్వుడు

హరితస్వుడనే రాజు గొప్ప సంగీత ప్రియుడు; స్వయంగా అద్భుతమైన గాయకుడు. ఆయన ఆస్థానంలో సంగీత విద్వాంసులనూ, గాయకులనూ పోషించేవాడు. వాళ్ళ నెంతో ప్రోత్సహించేవాడు. అయితే, వాళ్ళలో ఎవరుగానీ హరితస్వుణ్ణి సంగీతంలో మించలేకపోయేవారు.

హరితస్వుడు నారదుడి ఎదుట గానం చేసి ఆయన మెప్పు పొందాడు. సరస్వతి, బ్రహ్మ సమక్షంలో తన సంగీతాన్ని వినిపించి వారి ఆశీస్సులు పొందాడు. ఆయన కీర్తి, వైకుంఠంవరకు వ్యాపించింది. మహావిష్ణువు ఆయన్ను పిలిపించి పాడమన్నాడు. హరితస్వుడి అమృతగానం విని విష్ణువు ఆదమరచి నిద్రపోయాడు.



హరితస్వుడికి ఒకప్పుడు సంగీతానికి ఆద్యుడైన పరమశివుడి గానం వినే భాగ్యం కలిగింది. శివుడు శంకరాభరణ రాగాన్ని ఆలపించాడు. హరితస్వుడు ఏకాగ్రచిత్తంతో దానిని ఆలకించాడు. ఆ రాగం గురించి అభిప్రాయంకోరినప్పుడు, గాయకుడిస్వరంలో రాగానికి తగిన భావం లేదని చెప్పాడు. శంకరాభరణ రాగాన్ని ప్రశాంత చిత్తంతో ఆలపించాలి. శివుడు దానిని ఆలపించినప్పుడు శాంతంగా లేడు!

ఆ రాగం ఆలపించినప్పుడు శివుడు హరితస్వుడి సంగీత సామర్థ్యం గురించి ఆలోచించసాగాడు. అందువల్ల స్వరంలో భావంలోపించింది. అయినా, హరితస్వుడి పుల్లవిరుపు వ్యాఖ్యానం శివుడికి ఆగ్రహం కలిగించింది. ఆయన మూడవ నేత్రం తెరిచాడు. అది ఎదుటి వాళ్ళను భస్మం చేస్తుంది. దానిని చూసి హరితస్వుడు ఏమాత్రం భయపడకుండా, "మహాదేవా! పొరబాటు పొరబాటే! నేను భస్మమైపోయినా అదిఅలాగే ఉంటుంది!" అన్నాడు.

పరమశివుడు పెట్టిన పరీక్షలో హరితస్వుడు నెగ్గాడు. ఆయన అసమాన గాయకుడిగా, విమర్శకుడిగా మాత్రమే కాదు; అపూర్వమైన ధైర్యశాలిగానూ కీర్తిగాంచాడు.

ఆయన ధైర్యానికి సంతసించి, పరమశివుడు ఆయనకు అరుదైన వరాలిచ్చాడు. ఆ వరాల బలంతో, హరితస్వుడు దేవేంద్రుడంతటి వాణ్ణి బంధించిన అంధకాసురుడనే అతి భయంకర రాక్షసుణ్ణి సంహరించగలిగాడు!

## మీకు తెలుసా?

## జాజ్

పందొమ్మిదవ శతాబ్దం ఉత్తరార్ధంలో, అమెరికాలోని దక్షిణ రాష్ట్రాలలో ఆరంభ మైన సంగీతం జాజ్. ఒక మెట్టుతో ప్రారంభించి సంగీత కారులు దానిని




విడివిడిగా పాడుతూ ఆఖరుగా మొదటి మెట్టును మళ్ళీ పాడతారు. ఈ సంగీతం ఎలా మొదలయిందో తెలియదు. 1920 ప్రాంతం ఈ సంగీతానికి స్వర్ణయుగం అని చెప్పవచ్చు. అమెరికాలో అన్నిరంగాలలోని ఆబాలగోపాలాన్ని అలరించే సంగీతంగా అది అభివృద్ధి గాంచింది. దాని అభివృద్ధికి విశేష కృషి చేసిన సంగీతకారులలో మున్నెన్న తగిన వాడు లూయిస్ ఆర్మ్‌స్ట్రాంగ్. బెన్నీ గుడ్మన్, డిజ్జీ గిల్‌స్పై, గ్లెన్ మిల్లర్ మొదలైనవారు జాజ్ సంగీతంలో ప్రసిద్ధిగాంచారు.

## ఇంద్రధనుస్సు




### మొట్టమొదటి అంతరిక్షగామి

మొట్టమొదటి అంతరిక్షగామి 'లైకా' అనే ఒక కుక్క అంటే ఆశ్చర్యంగానే ఉంటుంది. అయితే ఇది నిజం. 1957వ సం।। నవంబర్ 3వ తేదీ రష్యన్ వ్యోమ నౌక స్పుట్నిక్ IIలో 'లైకాను' అంతరిక్షం లోకి పంపారు. అది ఉండే చోటును ఎయిర్ కండిషన్ చేశారు. దానికి కావల సిన ఆహారం అందులోనే ఉంచారు. అంతరిక్షంలో కుక్క నడుచుకునే తీరును, స్పుట్నిక్‌లో అమర్చిన పరికరాలు భూమి మీది విజ్ఞానవేత్తలకు నమోదు చేసి పంపాయి. అంతరిక్షంలోకి ప్రయోగించిన వ్యోమనౌకను మళ్ళీ భూమికి తీసుకువచ్చే విధానం ఆరోజుల్లో తెలియదు. అందువల్ల 'లైకా' అంతరిక్షంలోనే మరణించింది!

స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సర చందమామ కానుక!

# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం

అది 1600 సంవత్సరం. ఇంగ్లాండు చరిత్రలో ఉజ్వల కాలఘట్టం. దేశం చిన్నదే అయినప్పటికీ గొప్ప కలలు కనసాగింది!

దేశాన్ని అప్పుడు మొదటి ఎలిజబెత్ రాణి పరిపాలిస్తున్నది. సుప్రసిద్ధ నాటకకర్త షేక్స్పియర్ తన నాటకాలు ప్రదర్శించడం ప్రారంభించాడు. నావికుడు సర్ వాల్టర్ ర్యాలీ – బంగాళా దుంపలను, పొగాకును అప్పుడే అమెరికా నుంచి స్వదేశానికి తీసుకువచ్చాడు. సర్ ఫ్రాన్సిస్ బేకన్ సరికొత్త వచనశైలిలో 'వ్యాస' రచన చేయసాగాడు. ఇంకా పలువురు ప్రముఖులు తమ తమ రంగాలలో విశేష కృషి చేయసాగారు.

ఆ శతాబ్దం చివరి రోజున ఎలిజబెత్ రాణి – ఈస్ట్ ఇండియా కంపెనీ అనే ఒక వ్యాపారుల బృందానికి – దూరతీరాలలోని తూర్పు దేశాలలో తమ వస్తువులను అమ్ముకోవడానికి అనుమతిస్తూ ఒక పత్రంలో సంతకం చేసింది. ఆ కంపెనీ ప్రతినిథి సర్ థామస్‌రో – మనదేశంలో మొగల్ చక్రవర్తి జహంగీరు ఆస్థానంలో మూడేళ్ళు గడిపాడు. చక్రవర్తికి అతని పట్ల అభిమానం ఏర్పడి, భారతదేశంలో వ్యాపారం చేసుకోవడానికి అనుమతించాడు. సూరత్‌లో ఆరంభమైన వ్యాపారం త్వరిత గతిలో ఇతర ప్రాంతాలకు వ్యాపించింది.

క్రమేణా కంపెనీ ఆశలు పెరిగాయి. కేవలం క్రయవిక్రయాలకు మాత్రమే తన కార్యకలాపాలను పరిమితం చేసుకోలేకపోయింది. మొగలు చక్రవర్తులు బలహీనం కావడంతో, చిన్న చిన్న రాజులు బలపడసాగారు. వాళ్ళలో ఒకరితో ఒకరికి స్పర్థలు బయలుదేరాయి. ఈ పరిస్థితిని కంపెనీ తనకు అనుకూలంగా మార్చుకున్నది. కంపెనీ కొంత సైన్యాన్ని ఏర్పాటు చేసుకున్నది. ఒక రాజుకూ, మరొక రాజుకూ పగను రెచ్చగొట్టి, ఆ ఇద్దరిలో ఒకరికి సైనిక సాయం చేసి, సాయం చేసినందుకు ప్రతిఫలంగా ఆ రాజు నుంచి కొంత ప్రాంతాన్ని రాబట్టుకోసాగింది!

నూటయాభై సంవత్సరాలలో స్థానికులైన రాజులందరికన్నా కంపెనీ బలమైన శక్తిగా రూపాంతరం చెందింది. రకరకాల కారణాలు చూపి, నయానా భయానా వారి రాజ్యాలను కబళించసాగింది. ఆ విధంగా బ్రిటిష్ ఇండియా సామ్రాజ్యం ఏర్పడింది. చేతులు జోడించి, తలలు వంచుకుని ఈ దేశంలో వ్యాపారం చేసుకోవడానికి అనుమతిని వేడుకున్న వ్యాపారులు -కొంతకాలానికి నీడనిచ్చిన వారి కిరీటాలనే అపహరించడం ప్రారంభించారు! వర్తకులు పాలకులయ్యారు!

వాళ్ళు భారతదేశానికి వచ్చి రెండు వందలా యాభై సంవత్సరాలు గడిచాక, ప్రజలలో వాళ్ళ పట్ల అసంతృప్తి ఉచ్ఛ స్థితికి చేరుకున్నది. అది తిరుగుబాటుగా పెల్లుబికింది. ఆ తిరుగుబాటులో సైనికులు ఎక్కువమంది పాల్గొనడం వల్ల, బ్రిటిష్ పాలకులు దానిని సిపాయిల కలహం అన్నారు. కాని, అది కేవలం సిపాయిల తిరుగుబాటు మాత్రమే కాదు. బ్రిటిష్ పాలనను అంతం చేయాలని కాంక్షించిన భారత ప్రజలు ఆ తిరుగుబాటును జరిపారు. దానిని ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం అనడమే అన్ని విధాలా సమంజసం!

అస్తమిస్తూన్న సూర్యుడి కిరణాలు పడి భాగీరథీ నదీజలాలు బంగారు రంగుతో తళతళలాడుతున్నాయి. నదీతీరంలో పద్ధెనిమిదేళ్ళ యువకుడొకడు, ఏడేళ్ళ బాలికకు కత్తిసాము నేర్పుతున్నాడు. నదీ కెరటాల్లాగే ఆ ఇద్దరి దుస్తులు కూడా బంగారంలా మిలమిలలాడుతున్నాయి.

వందలాదిమంది ప్రజలు వాళ్ళిద్దరినీ కళ్ళార్పకుండా ఆశ్చర్యానందాలతో తిలకిస్తున్నారు. ఆ యువకుడు మెరుపువేగంతో కత్తి తిప్పడంలో ఆశ్చర్యంలేదు. కాని ఆ చిన్నారి బాలిక మెరుపు తీగలా గెంతుతూ కత్తిని అతిలాఘవంగా తిప్పడం ప్రేక్షకులకు అమితాశ్చర్యం కలిగించింది.

బిత్తూరుకు అతిథిగా వచ్చి, ఆ దృశ్యాన్ని చూసిన ఝాన్సీ రాజపురోహితుడు, "యువరాజుతోఆటలాడుతూన్నఆచిన్నారిఎవరు?" అని అడిగాడు. పీష్వా బాజీరావు మంత్రిని.

"మోరాపంత్ గారాలపట్టి మనూబాయి. యువరాజు ఆమెను సొంత చెల్లెలుగా భావించి,రాజోచిత యుద్ధ విద్యలు నేర్పుతున్నాడు. ఆమె చిన్నారి బాలికేగాని,నోరు కదిపితే చాలు ఎంతో అనుభవంవున్న ముసలమ్మలా మాట్లాడుతుంది. ఇక ప్రవర్తన అంటారా, మహారాణిలా నడుచుకుంటుంది!" అన్నాడు మంత్రి.

"అవును, మహారాణి కావడానికి తగిన అర్హతలు ఆమెకున్నాయి. ఆ నమ్మకం నాకున్నది!" అన్నాడు పురోహితుడు.

మొగలు సామ్రాజ్యాన్ని గడగడలాడించిన మరాఠా నాయకుడు ఛత్రపతిశివాజీ ఆస్థానంలో పీష్వాగా, అంటే ప్రధాన మంత్రిగా వున్న వారి వంశానికి చెందినవాడు రెండవ బాజీరావు. శివాజీ అనంతరం ఆయన పీష్వా అధికారం చెలాయించసాగాడు. ఆయన వారసులు





అతని వద్ద యుద్ధ విద్యలు నేర్చుకుంటున్న చిన్నారి బాలిక మరెవరో కాదు; ఉత్తరోత్తరా వీరనారిగా ప్రసిద్ధిగాంచిన ఝాన్సీరాణి లక్ష్మీబాయి!

పురోహితుడు ఝాన్సీకి తిరిగి వెళ్ళి, ఆమెను గురించి చెప్పగానే మహారాజు అనతిప్రకారంప్రధానమంత్రి, మరికొందరు ప్రముఖులు బిత్తూరుకు వచ్చి, మనూబాయిని ఝాన్సీ మహారాజు గంగాధరరావుకు వివాహం చేయించమని కోరారు.

వివాహమహోత్సవం వైభవంగానే జరిగింది. మనూబాయి మహారాణి లక్ష్మీబాయి అయింది. కాని ఆమె ఆనందకరమైన వైవాహిక జీవితానికి నోచుకోలేదు. ఆమె పద్ధెనిమిదవయేటే ఆమెభర్తమరణించాడు!

నానాసాహెబ్, లక్ష్మీబాయి ఇరువురికీ ఒక్కసారిగా విధి వక్రించింది. 1851వ సం॥ లో పీష్వా మరణించాడు. ఆ తరవాత భరణం ఇవ్వడానికి కంపెనీ నిరాకరించింది. నానాసాహెబ్, పీష్వా సొంత కుమారుడు కాడని కారణం చెప్పింది! ఆమాట విని నానాసాహెబ్ తన చెవులనే నమ్మలేక పోయాడు. మాజీపాలకు శాశ్వతంగా యేటా భరణం ఇస్తామని అంగీకరించిన తరవాతే పీష్వా తన రాజ్యాన్ని కంపెనీకి అప్పగించాడు. ఇంత త్వరలో కంపెనీ ఎలా మాట తప్పుతుంది? ఈ విషయం తెలుసుకోవాలని నానాసాహెబ్ ఒక లేఖ పంపాడు: "మీరు భరణం ఆపినట్టయితే, రాజ్యం మళ్ళీ మావశమైనట్టే కదా? మీరు పెట్టిన నియమాన్ని మీరే గౌరవించనప్పుడు ఒప్పందమే పూర్తిగా రద్దవుతుందికదా?"

రాజుల అనువంశిక అధికారాలను నిర్వహించసాగారు. అయితే, ఈస్టిండియా కంపెనీ రకరకాలపన్నాగాలతో వాళ్ళ రాజ్యాధికారాలను చేజిక్కించుకోవడానికి ఉపక్రమించింది. ఆఖరికి రెండవ బాజీరావు ఎటువంటి రాజ్యాధికారమూ లేకుండా కంపెనీ ఇచ్చే భరణంతో కాలం గడపవలసిన దుస్థితి ఏర్పడింది.

పీష్వాకు సంతానంలేదు. అతని ఆస్థానంలోని ఒకఉద్యోగి కుమారుడైన మాధవరావు అనే కుర్రవాడి తెలివితేటలు, ప్రవర్తన పీష్వాకు ముచ్చట గొలిపాయి. అతన్ని తన వారసుడిగా దత్తు చేసుకున్నాడు. 1827వ సం॥ ఒక ఉదయంవేళ ఆచిన్నారి బాలుడు పీష్వా వారసుడయ్యాడు. అతడే పెరిగి యువరాజు నానాసాహెబ్అయ్యాడు.

ఈ ప్రశ్నలకు కంపెనీ సమాధానం చెప్పలేకపోయింది. అసలు ఆ లేఖను పట్టించుకోనే లేదు. రాజ్యాన్ని కంపెనీకి అప్పగించిన తరవాత పీష్వాకు సొంతంగా సైన్యం అంటూలేదు. నానాసాహెబ్ ఎదురు తిరిగినా బ్రిటిష్ సైన్యంతో యుద్ధం చేసి రాజ్యాన్ని తిరిగి సాధించలేడన్న ధీమా దానికి కారణం!

ఇక్కడున్న వాళ్ళు ఇలా ఉన్నారు; వీళ్ళకు పైన లండన్‌లో ఉన్నవాళ్ళుఇంత దుర్మార్గులై వుండరని నానాసాహెబ్ ఆశించాడు. తన విషయం గురించి లండన్‌లోని ఉన్నతాధికారులకు తెలియజేయడానికి, నానాసాహెబ్ – అజిముల్లా అనే రాజనీతిజ్ఞుణ్ణి పంపాడు. అజిముల్లా వివేకవంతుడు, యజమానికి విశ్వాసపాత్రుడు; ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలు తెలిసిన వాక్చాతుర్యం కలవాడు. ఆయన లండన్‌లో చాలా మందితో మైత్రి ఏర్పరచుకున్నాడు. అయితే, కంపెనీ వ్యవహారాలలో ఎలాంటి అధికారాలూ లేని కొందరు ఆయనకు లేనిపోని ఆశలు కల్పించారు.

ఇంత జరిగినా నానాసాహెబ్ మాత్రం విదేశవ్యాపారుల మంచితనం మీద నమ్మకాన్ని పూర్తిగా చంపుకోలేకపోయాడు!

రెండు సంవత్సరాల తరవాత, మహారాజు గంగాధరరావు మరణించాడు. రాజు మరణించడానికి ముందే తన భార్య రాకుమారుణ్ణి దత్తత తీసుకునే అధికారాన్ని ఇచ్చాడు.

మహారాణి లక్ష్మీబాయికి భర్త మరణం పిడుగుపాటయింది. అయినా ఆమె దుఃఖాన్ని దిగమింగుకుని భర్త కోరిక ప్రకారం చంటి బిడ్డను భారతీయ సంప్రదాయానుసారం దత్తత చేసుకున్నది.



ఒకవైపు భర్త అంతిమ క్రియలనూ, మరొకవైపు శిశువును దత్తత తీసుకోవడం ఎంతో గుండెనిబ్బరంతో నిర్వహించింది లక్ష్మీబాయి. ఆస్థానంలోని మంత్రులు, అధికారులు, సామాన్య ప్రజలు ఆమెలో అసమాన ధైర్యసాహసాలు గల నాయకురాలినీ–మాతృమూర్తినీ దర్శించారు. రాజకుటుంబంలో జన్మించని ఒక వితంతువు; బాధలలో ఉన్నప్పుడు సోదరుల ఆదరణ వంటివి లేకుండా రాజ్యపాలనసాగించడం సామాన్యమైన విషయం కాదుకదా! దానికి తోడు సంతానం లేకుండా రాజు మరణించడంవల్ల, రాజబంధువులు రాజ సింహా

సనం చేజిక్కించుకోవడానికి ఉవ్విళ్ళూర సాగారు. అయినా, లక్ష్మీబాయి వాళ్ళ పాచిక పారనీయలేదు. త్వరలోనే అంద రినీ అదుపులోకి తెచ్చుకున్నది!

ఒకనాడు ప్రధానమంత్రి విచార వద నంతో లక్ష్మీబాయి దగ్గరికి వచ్చి, "మహా రాణీ! ఒక దుర్వార్త వినవలసి వచ్చింది!" అన్నాడు సంకోచంగా.

"మహారాజు మరణానికి మించిన దుర్వార్త ఏముంటుందిలే! ఫరవాలేదు, ధైర్యంగా చెప్పు," అన్నది లక్ష్మీబాయి.

"తల్లీ! తమరు దత్తత తీసుకున్న యువరాజుకు తమ రాజ్యం సంక్రమిం చదని కంపెనీ అంటున్నది!" అన్నాడు ప్రధాన మంత్రి.

"ఒకరాజ్యం ఒకరికి సంక్రమించాలి; సంక్రమించకూడదు అని నిర్ణయించడా నికి వీళ్ళెవరు? అది రాజుగారి అభీష్టం. రాజు లేనప్పుడు, రాజు భార్య నిర్ణయిం చాలి!" అన్నది రాణి, గంభీరమైన కంఠ స్వరంతో.

"దత్తు తీసుకోవడం వాళ్ళు అంగీకరిం చరట!" అన్నాడు మంత్రి.

"వాళ్ళెవరు దానినిఅంగీకరించడానికి? దత్తపుత్రుడికి సొంత కుమారుడికి సమాన మైనహక్కులు ఉన్నాయి. ఇదిమనదేశంలో తరతరాలుగా వస్తూన్న సంప్రదాయం.సీత జనకరాజు పుత్రిక కాదని ఎవరైనా అనగ లరా? అయినా ఈ మాత్రం కూడా తెలి యని మూర్ఖులా వాళ్ళు?" అని ప్రశ్నిం చింది లక్ష్మీబాయి.

"వాళ్ళు మూర్ఖులుకారు తల్లీ! పరమ దుర్మార్గులు! మన ఝాన్సీతో పాటు యావత్ భారతాన్ని తమ జమీందారీగా మార్చాలని, కుట్ర పన్నుతున్నారు!" అన్నాడు ప్రధానమంత్రి.

"అసంభవం! మన మాతృ భూమి ఝాన్సీని, బందిపోట్ల ముఠాకు ధారాదత్తం చేయలేం. వాళ్ళేం చేస్తారో చేయనీ మన గౌరవం కోసం, స్వతంత్రంకోసం మనం పోరాడి తీరాలి!" అన్న మహారాణి మాటలు విని, ప్రధానమంత్రితో పాటు అక్కడున్న వారందరూ ఒక విధమైన ఉద్వేగానికి లోనయ్యారు. అసాధారణమైన ఆమె ధైర్యానికి ముగ్ధులై తలలువంచి నమస్క రించారు. — (ఇంకావుంది)





# తారుమారైన తీర్పులు

పూర్వం సింహళదేశంలో ఒక వర్తకుడుం డేవాడు. ఆయన సముద్ర వర్తకం చేసి చాలా లక్షలు గడించాడు. ఆయన వృద్ధుడై చనిపోయే సమయంలో తన కొడుకైన జయపాలుణ్ణి పిలిచి, అతనికి తన వ్యాపారం అప్పగించి, "నాయనా, నువ్వు కూడా నాలాగే సముద్ర వ్యాపారం చెయ్యి. కాని పొరపాటున కూడా వంచక మహాపట్టణానికి వెళ్ళకు," అని సలహా ఇచ్చాడు.

తండ్రి పోయాక జయపాలుడు తన నాలుగు నౌకలనూ తీసుకుని వ్యాపారం చేయసాగాడు. వంచకమహాపట్టణానికి పోతే ఏమి జరుగుతుందో తెలుసుకోవాలని అతనికి కుతూహలం పుట్టింది. అతను తెలివిగలవాడు; అందుచేత, ఎవరైనా తనను మోసం చేసినా తాను ఎత్తుకు పైఎత్తు వేయగలనన్న ధైర్యం అతనికున్నది. కనుక అతను తన నాలుగు నౌకలనూ నడిపించుకుని ఆ పట్టణానికి వెళ్ళాడు. అది సూర్యోదయం వేళ. నౌకలను రేవులో ఉంచి జయపాలుడు తన విల్లూ, బాణాలూ వెంటబెట్టుకుని తీరం వెంబడి వేట షికారుకు బయలుదేరాడు. ఒకచోట అతనికొక నీటి కొంగ కనబడింది. అది సముద్రంలోని చేపలను వేటాడుతున్నది. జయపాలుడు తన విల్లు ఎక్కుపెట్టి గురిచూసి ఆ కొంగను కొట్టాడు. ఒక్క బాణంతో ఆ కొంగ చచ్చి సముద్రపు నీటిలో పడిపోయింది.

ఆ సమీపంలో చేపలను పట్టుతూ ఉన్న పల్లెవాడొకడు ఇది చూసి జయపాలుడి దగ్గిరికి పరిగెత్తుకుంటూ వచ్చి, "ఎవరయ్యా నువ్వు? నా తండ్రినిచంపావు. నీ మీద రాజుగారితో ఫిర్యాదు చేస్తాను చూస్తూ ఉండు!" అన్నాడు.

"ఆ కొంగ నీ తండ్రా?" అని జయపాలుడు ఆశ్చర్యంతో అడిగాడు.

"అవును. కిందటి జన్మలో నా తండ్రి. ఇప్పుడునీటికొంగ జన్మ ఎత్తి నాకు చేపల వేటలో సహాయపడుతున్నాడు!" అన్నాడు పల్లెవాడు.

జయపాలుడికి కోపం వచ్చింది. "పో, దిక్కున్నచోట చెప్పుకో!" అని చేపలు పట్టేవాణ్ణి గదమాయించాడు. వాడు మారు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

తరవాత అతను నగరం ప్రవేశించి నడుస్తూ ఉండగా ఒక మనిషి ఎదురై, "ఎన్నాళ్ళకు కనపడ్డావు, బాబూ! చాలా కాలం క్రితం నేను నా కుడిచెవి మీ తండ్రిగారివద్ద తాకట్టు పెట్టి పది రూపాయలు తీసుకున్నాను. ఆ బాకీ చెల్లిస్తాను. నా చెవి నాకు ఇప్పించు," అన్నాడు జయపాలుడితో.

జయపాలుడు నిర్ఘాంతపోయి, మనిషి కేసి చూశాడు. అతనికి ఎడమచెవి మాత్రమే ఉన్నది; కుడిచెవి లేదు. "మా నాన్నగారు నీ చెవి గురించి నాకేమీ చెప్పలేదే!" అన్నాడతను ఆ మనిషితో.

"నా చెవి నా కిప్పించక పోతే నేను నీ పైన ఫిర్యాదు చేస్తాను చూసుకో!" అంటూ ఆ మనిషి వెళ్ళిపోయాడు.

జయపాలుడు మరికొంతదూరం వెళ్ళేసరికి ఒక స్త్రీ ఎదురై, "చూడు, నాయనా! పదహారేళ్ళక్రితం మీ నాన్నగారు ఈవూరు వచ్చి నన్ను పెళ్ళాడి, తనదారిన తాను వెళ్ళిపోయారు. నాకు మనోవర్తి కింద పదివేల రూపాయలిస్తానని ఆయన మాట ఇచ్చారు. ఆ డబ్బు నువ్వు ఇస్తావా, లేక ఫిర్యాదు చేయమన్నావా?" అని అడిగింది.

జయపాలుడు ఈ దుర్మార్గాన్ని సహించలేక, "పో, నేను నీకు దమ్మిడీకూడా



ఇవ్వను!" అని తన నౌకల వద్దకు తిరిగి వెళ్ళాడు.

అక్కడ రేవులో అతనికి ఒక క్షురకుడు కనిపించి, "క్షౌరం చెయ్యమంటారా, బాబూ?" అన్నాడు.

"ఏం తీసుకుంటావు?" అని అడిగాడు జయపాలుడు.

"నన్ను సంతోష పెట్టండి, దొరా!" అన్నాడు క్షురకుడు.

జయపాలుడు సరేనని వాడిచేత క్షౌరం చేయించుకుని ఒక రూపాయి ఇవ్వబోయాడు. క్షురకుడు తీసుకోలేదు. అయిదు రూపాయలిచ్చినా వాడు నిరాకరించాడు.

జయపాలుడికి ఆగ్రహం వచ్చి, "నీకు నేనేమీ ఇవ్వను. దిక్కున్న చోటుకు వెళ్ళి చెప్పుకో!" అన్నాడు.

చేపలు పట్టేవాడూ, చెవిలేనివాడూ, ఆడదీ, క్షురకుడూ ఈ నలుగురూ రాజ సభకు వెళ్ళి జయపాలుడిపైన ఫిర్యాదులు చేశారు. జయపాలుణ్ణి రాజసభకు పిలిపించారు. విచారణ ఆరంభమయింది. మొదట చేపలు పట్టేవాడు రాజుగారితో, "మహారాజా, చచ్చి పోయిన నా తండ్రి నీటి కొంగగా పుట్టి నాకు చాలా కాలంగా చేపల వేటలో సహాయంచేస్తూంటే ఈ మనిషి పొద్దున ఆ కొంగను కాస్తా చంపి నాకు తీరని నష్టం కలిగించాడు," అన్నాడు.

రాజుగారు జయపాలుడికేసి తిరిగి, "ఈ చేపలు పట్టేవాడికి ఒక నౌక పరిహారం ఇయ్యి!" అన్నాడు.



తరవాత చెవిలేనివాడు ఫిర్యాదు చేశాడు. "మహారాజా, ఈ మనిషి తండ్రి దగ్గిర నా కుడి చెవి తాకట్టుపెట్టి పది రూపాయలు తీసుకున్నాను. ఆ బాకీ చెల్లువేస్తాను. నా చెవి నాకు ఇప్పించమంటే ఈ మనిషి నన్ను దిక్కున్నచోట చెప్పుకోమన్నాడు," అని వాడన్నాడు.

రాజుగారు తీర్పు చెబుతూ, జయపాలుడు చెవిలేని వాడికి ఒక నౌకను పరిహారంగా ఇవ్వమన్నాడు.

తరవాత స్త్రీ జయపాలుడిపైన ఫిర్యాదు చేసింది. ఆమెకు కూడా రాజుగారు జయపాలుడి నౌక ఒకటి ఇవ్వవలసిందిగా తీర్పు చెప్పాడు.

ఆఖరుకు క్షురకుడు వచ్చి ఫిర్యాదు చేశాడు. "అయ్యా, ఈయన నా చేత



యావత్తూ పోయింది. "ఇప్పుడు ఏం చేయాలి? ఈ ఇక్కట్టులో నుంచి ఎలా బయటపడాలి?" అని అతను ఆలోచిస్తూ ఉండగా రాజసభలోకి రాజుగారి కొడుకు పదేళ్లవాడు వచ్చాడు.

వెంటనే జయపాలుడు తన మెడలో వున్న రత్నహారం తీసి రాజకుమారుడి మెడలో వేశాడు.

సభలో అందరూ చప్పట్లు కొట్టి హర్ష ధ్వానాలు చేశారు.

రాజుగారు కూడా తన కొడుకును దగ్గరికి పిలిచి, అతని మెడలోవున్న రత్న హారం చూసి ముచ్చటపడ్డాడు.

జయపాలుడు సభికులకేసి తిరిగి, "నేను రాజకుమారుడికి ఈ రత్నహారం ఇచ్చినందుకు ఈ సభలో సంతోషించని వారెవరైనా వున్నారా?" అని అడిగాడు.

"లేరు, లేరు!" "సంతోషించాం!" అని అందరూ కేకలు పెట్టారు.

జయపాలుడు క్షురకుడికేసి తిరిగి, "ఏమోయ్, నీ మాటేమిటి? నువ్వు కూడా సంతోషించావా?" అని అడిగాడు.

క్షురకుడికి సంతోషించానని చెప్పక తప్పిందికాదు.

జయపాలుడు రాజుగారికేసి తిరిగి, "మహారాజా, క్షురకుణ్ణి సంతోషపెట్టాను. అందుచేత వాడికి నేను నౌక నివ్వనవ సరంలేదనుకుంటాను!" అన్నాడు.

"అవును, అవసరం లేదు!" అన్నాడు రాజుగారు.

తరవాత జయపాలుడు స్త్రీకేసి తిరిగి, "అమ్మా, నీ మనోవర్తి విషయమై ఒక

క్షౌరం చేయించుకుని నన్ను సంతోష పెడతానన్నాడు. ఆయన నౌక ఒకటి నా కిప్పిస్తే నేను సంతోషిస్తాను. అంతకంటె తక్కువ అయితే నేను సంతోషించను!" అన్నాడు.

"క్షురకుడు చెప్పేది సబబుగానే వున్నది. అందుచేత జయపాలుడు క్షురకుడికి ఒక నౌకను ఇచ్చుకోవాలి!" అని రాజుగారు తీర్పు చెప్పాడు.

ఈ ఫిర్యాదులూ తీర్పులూ విని జయపాలుడు నిర్ఘాంతపోయాడు. ఈ నగరానికి వంచక మహాపట్టణమని పేరెందుకు వచ్చిందో, అక్కడికి వెళ్ళవద్దని తండ్రి ఎందుకు సలహా ఇచ్చాడో అతనికి బాగా తెలిసి వచ్చింది. అతని మెడలోవున్న రత్నహారం తప్ప మిగిలిన అతని ఆస్తి

సంగతి చెప్పాలి. ఆ మనోవర్తి నీకు ఇస్తాను, కాని ఒక్క చిక్కున్నది. మా దేశాచారం ప్రకారం భార్య భర్తతో సహగమనం చేయాలి. దురదృష్టవశాత్తూ మా తండ్రిగారు ఏడాది క్రితం పోయారు. అందుచేత నువ్వు చితి పేర్చుకుని చనిపోయినట్టయితే నీవారసు లకు పదివేలిస్తాను," అన్నాడు.

"నేను బలవంతాన ఒక్కనాటికీ చావను!" అన్నది స్త్రీ.

జయపాలుడు రాజుతో, "మహారాజా, నేనీమెకు పరిహారం చెల్లించనవసరం లేదనుకుంటాను," అన్నాడు.

రాజు సరేనన్నాడు.

తరవాత జయపాలుడుచెవిలేనివాడితో, "బాబూ, నీ చెవి నీ కిప్పించటానికికూడా నాకభ్యంతరంలేదు. మా తండ్రిగారి హయాంలో ఎన్నో వేలమంది తమ చెవులు తాకట్టుపెట్టి నీలాగే ఋణాలు పుచ్చుకు న్నారు. వాటిలో నీచెవిపోల్చటం సాధ్యం కాదు. అందుచేత నమూనా కింద నీఎడమ చెవి కోసి ఇచ్చావంటే దానితో సరిపోల్చినీ రెండుచెవులూ నీకుపంపుతాను," అన్నాడు.

ఇందుకు చెవిలేనివాడు ఒప్పలేదు. వాడికి పరిహారం ఇవ్వనవసరంలేదని రాజుగారు తీర్పు ఇచ్చాడు.

తరవాత జపాలుడు రాజుగారితో ఇలా అన్నాడు:

"మహారాజా, నా తండ్రిగారు చనిపో యాక చేపగా పుట్టి నాకు నౌకలు నడప టంలో ఎంతగానో సహాయపడుతూ ఉన్న సమయంలో ఈ చేపలు పట్టేవాడి తండ్రి కొంగరూపంలోవచ్చి ఆయనను అమాం తం మింగేశాడు. అందుచేత నేనా కొంగను చంపాను. చేపరూపంలో వున్న మాతండ్రి ఆ విధంగా చనిపోకపోతే నేనీ నగరం చాయలకు రావటమే జరిగేది కాదు!"

రాజుగారు ఈమాటవిని ఎంతో సంతో షించి, జయపాలుడు చేపలు పట్టే వాడికి కూడా పరిహారం ఇవ్వనవసరం లేదని తీర్పు చెప్పేశాడు.

తరవాత జయపాలుడు ఒక వారంరోజు లపాటు రాజుగారి అతిథిగా వుండి,ఆయన వద్ద కొన్ని బహుమానాలు పొంది, తన నాలుగు నౌకలను తరలించుకుని తన దేశానికి వెళ్ళిపోయాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు **1997** అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



S. G. SESHAGIRI



S. G. SESHAGIRI

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * ఆగస్టు నెల**15**వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం.* వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, చెన్నయ్ - 600 026

### జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎలా వచ్చాయో దీంట్లోకి నీళ్ళు!

రెండవ ఫోటో : ఏం పెట్టాలో దీనికి పేరు?

పంపినవారు : మైస నరసింహారావు ఎల్. ఐ.సి. ఆఫ్ ఇండియా

కొత్తగూడెం, ఖమ్మం జిల్లా **-507 101** (ఆం.ప్ర)




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., Chandamama Buildings, Chennai - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, 188, N.S.K. Salai, Vadapalani, Chennai - 600 026 (India) Editor : NAGI REDDI.



A SHARP MIND NEEDS A SHARP PENCIL




NATARAJ®

* Offer available on 10s pack of Nataraj 621 HB and Nataraj Petals pencils only. Offer valid till stocks last.

QUALITY PRODUCTS FROM HINDUSTAN PENCILS LTD.

everest/95/HPL/25 R